ఈశ్వరవిలాస గ్రంథమండలి.

ప్రథమ కుసుమము.



# భద్రాయువు

అను

(ఐదంకముల నాటకము)

రచయిత:

## చిలుమూరు గురులింగశాస్త్రి

ప్రచురణ:

ము వేంకటసుబ్బయ్యగారి యాత్మశాంతికి

దౌహిత్రుఁడు

వెలుగు సౌభాగ్యరావు

చిలుమూరు.

**1950.**

ఈశ్వరవిలాస గ్రంథమండలి

ప్రథమ కుసుమము.

# భద్రాయువు

(ఐదంకముల నాటకము)



రచయిత:

చిలుమూరు గురులింగశాస్త్రి

ప్రకాశకులు:

నందివెలుగు సౌభాగ్యరావు

చిలుమూరు

**1950**

ఓం

శ్రీ శివంభూయాత్

# ఈ నాటకమున వచ్చు పాత్రలు

పురుషులు.

1 భద్రాయువు : కథానాయకుడు.
2 వజ్రబాహుఁడు : కథానాయకుని తండ్రి.
3 ఋషభయోగి : శివయోగి.
4 చంద్రాంగదుఁడు : నిషధపురరాజు.
5 పద్మాకరుఁడు : వైశ్యుఁడు.
6 జయసేనుఁడు : వజ్రబాహుని మంత్రి.
7 సునయుఁడు : భద్రాయువు చెలికాఁడు.
8 హేమరథుఁడు : మగధరాజు.
9 విక్రమసేనుఁడు : మగధసేనాధిపతి.
10 చంద్రశర్మ : విద్యాగురుఁడు.
11 కపటబ్రాహ్మణుఁడు : సదాశివుని మాయారూపము
12 పరమేశ్వరుఁడు.

స్త్రీలు:

1 కీర్తిమాలిని : కథానాయకి.
2 సీమంతిని : ,, తల్లి.
3 సుమతి }
4 ప్రభావతి } వజ్రబాహుని భార్యలు.
5 మాలతి }

## నాంది

ఉ॥ శ్రీయుతులై నిరంతరమ । రిందముశంకరు నాత్మఁ గొల్చుచున్
శ్రేయము లగ్గలింప నుత । శీలురనై బుధమాన్యలౌచు మే
ధాయుతులై యశోధనని । దానసమంచితసుప్రవృత్తి భ
ద్రాయువుఁ గాంచి సౌఖ్యమున । రాజిలు గావుత భక్తు లెల్లెడన్॥

# అ వ తా రి క

1. "కావ్యేషు నాటకం రమ్యమ్" అనికదా యార్యోక్తి. నాటకరచనాప్రదర్శనములు, పురాణ యుగముల నైతమున్న పనుటి నిర్వివాదాంశము భూలోకమున మాత్రమేకాక లోకాంతరములయందుఁగూడ నాటకప్రదర్శనము లుండెడివని పురాణములు వచించుచున్నవి అవి యీనాటియాధునికపద్ధతులతోఁ గాకున్నను వేరొండు రూపమునైననుండియుండవచ్చును. ఇటీవలఁ గొందఱు మహనీయులు ప్రదర్శనము లవినీతికారణము లగుచున్నవని వాకొనుచున్నారు. పురాణములు, నాటకము లవినీతికారణములైన నైతికప్రచారసాధనము లెవ్వియో దుర్గ్రహము.

2 వీధినాటకముతో నారంభింపఁబడిన ప్రదర్శనము, చలనచిత్రప్రదర్శనమువఱకెగఁబ్రాకి ప్రపంచమంతటిని ప్రేక్షకమయ మొనర్చినది. తెలుఁగునాట నేఁటికిని నాటకపుస్తకములు వేలకువేలుగ నుప్పతిల్లుచున్నవి. ఉత్తమనటీనటులు రంగస్థలముల కెక్కి యాదర్శప్రాయముగ నటించి కవులశ్రమను సార్థకపరచుచున్నారు. ప్రహసనరూపములగు నాటకము లెన్ని విరచితములైనను బురాణనాటకముల కీనాటికిని విలువ తఱుగలేదు. చరిత్రాత్మకనాటకములు, రాజకీయాభ్యంతరములచే రంగస్థలముల నెక్కుడుగఁ బ్రదర్శింపఁ బడకున్నను మున్ముందు పరివ్యాప్తము గాఁగలవనుట నిస్సంశయము. కవి యెంత సరళసృష్టి యొనర్చినను నటకుఁడే పోషకుఁడు.

3. ఆంధ్రవాఙ్మయమున శైవకథావిలాసములు రంగస్థలముల నఱుదుగఁ గాన్పించుచున్నయవి. కవులు రచించినను బ్రదర్శన కనువుకాని సన్నివేశములుఁ అందములేని భూమికాధారణములు, ప్రేక్షకజనానందపాత్రములు కావని ప్రదర్శకు లనుమానించుచున్నారు. రాజస్థానములకు సంబంధించిన రమ్యత రసన్నివేశములతో శివభక్తవిలాసము లనేకములుండ

నిట్టిసందేహములతో శైవనాటకప్రదర్శనముల మానివైచుచున్నారు. ఇట్లుండ నొకనాటిప్రదోషకాలమున మదారాధ్యదైవమగు శ్రీరామలింగేశ్వరస్వామిసన్నిధిని నన్నుంగని యనంతవరపురనివాసులగు బ్రహ్మశ్రీ కుప్పా వేంకటకృష్ణయ్య, విష్ణుభట్ల రామలింగయ్యగారలు, "శైవనాటక" రచనం బొనర్పుఁడని ప్రోత్సహించి యయ్యదియే శుభముహూర్తంబని నారికేళఫలపుష్పాదుల సమకూర్చిరి అంత యథావిధి నమ్మహాదేవు నారాధించి "బ్రహ్మోత్తరఖండము" నందలి రసోదంచితమగు సీమంతిని గాథను రూపకముగ రచియింప నారంభించితి మూలాతిక్రమణకుఁ దావొసంగకయే, యెడనెడఁ బ్రదర్శనానుగుణముగ స్వతంత్రించి కొన్నిరంగములఁ జేర్చితిని. పండితప్రకాండు లిందులకు క్షమియింతురుగాక.

4. మూడంకములు వ్రాసియు, ముద్రణవ్యయమును భరింపఁజాలననెడి నిరుత్సాహమున రచన మానియుండ నొకనాఁడు మాపెదతండ్రిగారి మనుమఁడును నందివెలుఁగు వంశాంబుధిరాకాశశాంకుఁడునగు "సౌభాగ్యరావ" ను చిరంజీవినాయెడ కేతెంచి కుశలప్రశ్నానంతరమున సంభాషణవశమున నాయీప్రయత్నవిముఖత నెఱింగి యుత్సాహప్రేరితుఁడై ముద్రణవ్యయమును తాను భరింతుననియుఁ ద్వరలోఁ బూరించుమనియు హెచ్చరించె. అవ్విధముగ మరల మదీయహృదయకేదారమున నాశాంకురములు మొలకలెత్తుటయు మహానందమునఁ బూర్తిఁ గావించితి. పిమ్మటమా గ్రామమునఁగల శ్రీరామా ట్యుటోరియల్ కాలేజియం దాంధ్రాధ్యాపకులుగనున్న బ్రహ్మశ్రీ "అవ్వారి వాసుదేవశాస్త్రి" గారి కెఱిగించితిని. అవ్యాజానురాగంబున వారును దీరికకలిగినపుడెల్ల నారచనను విని సదభిప్రాయమునొసంగి మదీయకృతజ్ఞతాభివందనములకుఁ బాత్రులైరి. వెండియు 'ఆంధ్రసాహిత్యసరస్వతీ— విద్యాభూషణే' త్యాదిబిరుదాంకితులగు బ్రహ్మశ్రీ "విద్వాన్ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రి" గారిసన్నిధి కఱిగి యథోచితముగఁ బరిష్కరింపఁ గోరితిని. శ్రీవారును కరుణామయులై వెంటనే శ్రమించి సాంగముగ తిలకించి తత్తదుచితవిధానములఁ బరిష్కరించి

సుపక్షితమగు నీరూప మొసంగిరి. దయార్ద్రహృదయులై మనఃపూర్వకా శీర్వాదముల నొసంగిన శ్రీవారికి నిరంతరనమోవాకము లర్పించుకొనుచు ముద్రణ ప్రయత్నమునకు దొరకొంటిమి. గుణవివేచనమునకు సహృదయు లున్నారుగదా యని విశ్వాసము.

5 సదభిమానమున స్వల్పవ్యయముతో సీహొత్తమును నిర్దుష్టము గను, సుందరముగను ముద్రించి నాశ్రమను సార్థకపఱచిన బ్రహ్మశ్రీ "మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రి" గారికి నాకృతజ్ఞతాభివందనములు.

ఇట్లు సుకవిజన విధేయుఁడు

చి లు మూ రు గు రు లిం గ శా స్త్రి

# తొలి పలుకు

ఆంధ్రసారస్వతమున రూపకములు లెక్కకు మిక్కిలి. అభిలషితార్థచిత్రణమునందును, రసభావవైఖరీవిన్యాసములందును, హృదయసమార్ద్రీకరణకార్యమునందును, శ్రావ్యములకన్న దృశ్యములే మిన్నలనుట యథార్థమునకు చేరువచేయగును. నేటికాలమున పౌరాణికములన్న నేవయు, సాంఘికములన్న తకితీపులును, పాఠకలోకమున కలుగుచున్నవనుట గమనించుచునే యున్నాము. కాని, మేమట్టియాశయమున కంగీకృతి యొసగజాలకున్నాము కథావస్తువేదైనను- పౌరాణికము కానిండు- చారిత్రకము కానిండు-సాంఘికము కానిండు-వస్తువిన్యాసము సముచితమై యొసగెనేని, పాత్రచిత్రణము హృదయంగమమై యొప్పారెనేని, రసభావప్రకటనము మానసాకర్షణ కరణచణమేని, ఘటనములన్నియు ప్రాతిస్వీకములయి, పరస్పరసహాయకములయి, ఏర్చి, కూర్చినట్లు, ఏర్పడియుండునేని, అట్టిరూపకములు రసికలోకమున కుపాదేయములనియే మాతలంపు. దుర్భర, విషమ, ఘటనముల నేర్పరించి, ఉద్వేగకారణపౌష్కల్యమును సంపాదించుకొని, తీవ్రరససముద్రేకముల ఎదలోనిలోతుల కదలించి, మానసావిలతాహేతువులగుచున్న కొన్నిసాంఘికములకన్న, ఆదర్శజీవనమును ప్రదర్శించి, భక్త్యాదిభావముల ప్రోదిచేసి, శాంతిసమున్నతికి పాదుకట్టి, దైవీసంపదను వెలార్చి, ఉన్నతోన్నత జీవితపరిధులకు తార్పగలిగిన ఉదాత్త పౌరాణికచిత్రములే ప్రశస్యతరములేమో అనియు నూహింతుము.

ఈ భవప్రియువు పవిత్రశైవసంహితలు అవతంసించుకొన్న యొకమధురాతిమధురఘట్టము. పరశివవిలాసము లనంతములనియు, శివ

భక్తికి అసాధ్యము లేదనియు, శివపాదసమర్పిత జీవితసర్వస్వాల రక్షణ భారము పరశివునిదే అనియు, విపులముగా, గాఢముగా, మధురముగా, ఈభద్రాయువు, ప్రశంసించుచున్నది. ఉన్నది 'స ఏక ఏవ రుద్రః' అని నిర్ణయించుకొని, 'సత్యం, శివం, సుందరమ్' అగుప్రపంచము 'సర్వము న్నతని దివ్యకళామయమంచు' నెంచుకొని, పానీయంబులు త్రావుచో. కుడుచుచో, భాషించుచో, హాసలీలానిద్రాదులు చేయుచో, ఆదివ్యశక్తిలీలావిలాసములనే ఆస్వాదించుచు, కర్మమయమగు జీవితమును ధర్మమయముగను, ధర్మమయమగు జీవితమును కళ్యాణమయముగను, దిద్దుకొని సంసారమున పశుత్వము సమాక్రమించినను, పాశవిమోచనమున పశుపతిత్వమును ప్రాపించి, 'శివో హమ్' అనుభవించిన జీవులుకదా చరితార్థజీవితులు, ఆనందపారదృశ్వులు, స్పృహణీయ మహామహిమోపేతులు! అట్టి శివభక్తవతంసములలో నొకడగు భద్రాయువు పవిత్రచరిత్రమును చిత్రించుట కవి భాగధేయమే అని మానిశ్చితమును అంతియకాక, ఇందు ఋషభయోగి యను శివతపస్విమాహాత్మ్యము సమంజసముగ నుపవర్ణితమైనది, గురుకృపాకటాక్ష ఫలములకు పాత్రమైనవారికి వీడరాని చెట్టయు, అందరాని మేలును లేదుకదా! శివసూక్తి ఫలింపకున్నను-ఎంతచిత్రము!-శివభక్తసూక్తి అన్యథీకృతము కాజాలదట!! దీనికి పరిపూర్ణలక్ష్యము ఈకథానకమే.

ఇందు పౌరాణికమగు నీకథావస్తువు యధాతధముగనే ఉల్లేఖింపబడినది మార్పులుకానీ, చేర్పులుకానీ, రసపరిపుష్టికొఱకయికానీ, పాత్రలయుదాత్తతకొఱకయికానీ, సంధానింపబడలేదు. అందువలన సంవిధానవైచిత్రిని మనము ఇం దాసించి లాభము లేదు. పాత్రములుకూడ, రసానుగుణముగ, గంభీరములుగను, ఉదాత్తహృదయములుగను, తమనిర్మితిని పోషించుకొన

లేమ అగుట, ఆదర్శసృష్టి కొఱవడినదనియే చెప్పవచ్చును, రూపకనిర్మాణమన్న అలంతి కాదుకదా: 'కావ్యేషు నాటకంరమ్యం' అనికదా యాభాణకము. అంతియకాక, కవికి ఇది ప్రథమప్రయత్న మగుటయు యోచింపదగిన విషయము.

అంగియగు నద్భుతమును, అంగములను వీర, రౌద్ర, కరుణములును, సముచితముగా పరిపోషితములయి, హృదయావర్జకములగుచున్నవి.

రచనయంతయు నాతిక్లిష్టమయి, మధురపదసంఘటితమయి, కుంటుపడక, చదువ చవులూర చేయుచున్నయది. రసోల్బణత కలిగినపట్టులు మనోహరగమనముతో, ఉదాత్తభావసంపత్తితో, అఖిలషితార్థ సమర్పకలలిత పదసమూహముతో సహృదయుల తనుప జాలియున్నవి. కవి భక్త్యావేశభరితమానసుడగుట, భగవద్వర్ణనాసందర్భములు హృదయపులోతుల స్పృశింపజాలియున్నవి. 'సాగర మంతలో స్థలమయంబుగఁ జేయు, ధరనంతలోనె సాగర మొనర్చు' మున్నగు స్థలములు ఈవిషయమునకు తార్కాణలు. కీర్తిశాలినీస బంధము భద్రాద్రియుర్జీవితమున కెట్లు మెఱుగులు దిద్ది మాధుర్యముల పంతరించి, అమృతమయతను కూర్చినదో, అట్టులనే, ఈకావ్యమునకును తనపాతివ్రత్యసుషమతో, నిభృతప్రణయప్రాగల్భ్యముతో, అద్భుతావహఘట్టములతో, రసమాధురీఝరులతో, ప్రౌఢతను, పవిత్రతను, స్పృహణీయతను, కమనీయతను, సంపాదించిపెట్టినది. ఈభద్రాయుర్జీవముతో, ఓతప్రోతముగ నల్లుకొనిపోయిన ఋషభయోగిజీవితమును, ఈశ్వరసద్భావమునకు మాత్రమేకాక, ఆతనికరుణావరుణాలయత్వమునకు. భక్తత్రాణపరాయణతకు ప్రధాననిదానమై యున్నది. 'ఒరులకిచ్చుటయేకాని. పరులయొద్ద నెట్టిప్రత్యుపకృతి గొననట్టి' అని కవి ఋషభయోగి' ముఖమున వెల్వఱచినసూక్తి ఈశ్వరప్రకృతికి ఎంతయు తగియున్నదికదా.

ఈఉభయార్థియుపు పావనకథావిధాన మని మాత్రమేకాక, రసోదంచిత పద్యరకవితాబంధమనియు నెన్నదగి యున్నది. అందువలన, శివభక్తాగ్రగ సులకుమాత్రమే కాక, రసమాధురీపిపాసువులగు సారస్వతులకును, ఉపాదే యమై యున్నది. రచయిత శైవకథామణిహారమునుండి, ఇట్టివియే యగు మేలిరతనముల నేరి, తననేలుపుతీఱుపులతో, ముద్దులొలుకు కబ్బపుతొడ పుల సంతరించి, ఆంధ్రసరస్వతీచరణకంజముల కై నేయు కావుతమని ఆసిం తుము, ఈగ్రంథమున అందంమ దొలిలిసి 'యనుకూలవతి' వంటి నెజసుల సుగుణనిహితచక్షుష్కు లగుట, పరిగ్రహింపరని విశ్వసింతుము.

అమృతలూరు
20 4 50

డాక్టర్
విద్వాన్, నా, వేంకటేశ్వరశాస్త్రి

---

# కృతిసమర్పణ.

తే॥ గీ॥ ఆంధ్రదేశాన కృష్ణవే ణ్యంకసీమ
గర్తపురమండలంబున గ్రాలుచుండు
ఉభయరామేశ్వరంబు నా నొప్పు మిగిలి
కలిత శుభసీమ చిలుమూరు, గ్రామ మొకటి

కం॥ ఆపుణ్యక్షేత్రంబున
నేపగు చిలుమూరువంశ హిమకరుఁ డనగన్
నెప్పరి వేంకటసుబ్బయ
కాపుర మొసరించె భోగ కలితుం డగుచున్.

తే॥ గీ॥ కాశ్యపసగోత్రు డాయన సుచరితునకు
మాచమాంబకు నుదయించె నంచితముగ
పుత్రికారత్నత్రితయంబు పుణ్యవతులు
వారి ననయంబు నిలఁబ్రోచు పరమశివుఁడు.

సీ॥ అం దగ్రతనయయై యమలసదాచార
లింగప్రసూనాంబ లీలవెలయు
అద్వితీయగుణాఢ్య యౌద్వితీయతనూజ
అవనిసావిత్రమ్మ యనగ నొప్పు
కులధర్మగుణపూత యలతృతీయాత్మజ
వేంకటసుబ్బమ్మ వెలయు జగతి
అందు సావిత్రమ్మ యనుసాధ్వి గోపాల
కృష్ణులకు జనించి కీర్తి నెగడి

తే॥ గీ॥ తొడరు సహకార సాంఘికో ద్యోగగరిమ
ప్రథితయశుఁడైన "సౌభాగ్య రావు" నకును
నెమ్మి నొసఁగితి నీరూప కమ్ము "కృతిగ"
గాన భద్రేశు డీధీరు గాఁచుగాక.

ఆ॥ వె॥ నందివెలుఁగువంశ నవ్యరాకాచంద్రు
శాంతశమదమాది సద్గుణాఢ్యు
ఆర్యపుత్రు సుబ్బ యార్యుని దౌహిత్రు
సత్యవచను విజ్ఞు సరసహృదయు
సాంద్రకీర్తిశాలి సౌభాగ్యరాయుని
నెలమి నోము సతత మీశ్వరుండు.

ఇట్లు.
రచయిత

# మనవి

సారస్వతసేవయే సాధుసేవయనియు పారస్పరికవిజ్ఞానాభివృద్ధికి పరమకారణమనియుఁ బ్రాజ్ఞులయభిప్రాయము. అంతియకాక పెద్దనామాత్యుఁడు తన "మనుచరిత్రమునందు" పోయి సేవింపలేకున్న పుణ్యతీర్థమహిమ వినుటయే నఖిలకల్మషహరం" బని వచించినాఁడు యేపగిదినైన భాషాసేవ యొనర్చుటయే పరమార్థమనుతలంపే నాయీప్రయత్నము.

మహనీయులగు కవితల్లజులు కావ్యసృష్టి యొనర్చి తాళపత్రములలిఖించి యాంధ్రమాతకు సమర్పించిపోయిరి నేఁడవి యన్నియు భాషాభిమానులయాదరమున క్రమముగ ముద్రితము లగుచున్నవి. నేటియాంధ్రవాఙ్మయమున లెక్కకు మిక్కిలిగ పొత్తము లుత్పత్తిల్లినను కవులు రచియించుచునే యున్నారు. భాషాభిమానులు ప్రకాశింప జేయుచునే యున్నారు,

"శ్రేయాంసి బహువిఘ్నాని" యనునార్యోక్తి యేల రిత్తవోవును? విశ్రాంతి యనునదిలేని జీవనకృషి తాత్కాలికదుష్టగ్రహబాధితమైన జీవిక, ఉత్సాహభంగకరములగు సంఘటనలు, ఆయాయివైకల్పికము లనివార్యములుగా నగుటయె నంతకంతకు ముద్రిణయత్న మాలస్యమయ్యె! ఈ నాటి కీవిధముగ సర్వావరోధవిముక్తమగు నీరూపకమును భాషాభిమానుల కరకమలముల నలంకరింప ననుగ్రహించిన సదాశివున కనంతాభివాదనము లొనర్చువాఁడ.

మాయీసంకల్పము నభిమానించి స్వల్పవ్యయమున ముద్రించి యిచ్చి చేయూతనొసంగిన బ్రహ్మశ్రీ "మల్లాది లక్ష్మీనృసింహశాస్త్రి" గారికెంతయుఁ గృతజ్ఞుడను నాయీకృషినిభాషాభిమానులగు నాంధ్రమహాజను లభిమానించి యాశీర్వదింతురుగాక,! ఇతోధికగ్రంథరచన యొనర్చి భాషాసేవయొనర్ప కృతికర్తను నమఃకుసుమములచే బహూకరించువాఁడ!

| | |
|---|---|
| కోఆపరేటివ్ సూపర్వైజర్ | ఇట్లు సారస్వతాభిలాషి |
| మకామ్, దుగ్గిరాల. | నందివెలుగు సౌభాగ్యరావు. |

# పండితాభిప్రాయము.

భద్రాయువను నాటకమును నేనామూలాగ్రముగా వినియున్నాను. వీరికవిత్వములో నాకుఁ దోచినసుగుణములు, విస్తరభీతిచేఁ గొన్ని మాత్ర మే యిట వెలువరింపఁ గలుగుచున్నాను

ఈకవిగారికి 'వఱువాత' 'అగ్గలము' 'అగ్గించుట' మున్నగుజాను తెనుఁగుపదము లప్రయత్నముగనే భాషలో వెలువడుచుండును. ఇట్లుండ ఱికిని సాధారణముగ నిట్టిపదములు పడవు. కాన నిది యొకగొప్పకవితా గుణమే ఇట్టిపదము లీవిధమున వెలువడుచుండుట ''ప్రతిభానవతః కవే రహం పూర్వికయా పరాపతంతి'' యని ధ్వన్యాలోకకారుఁడు చెప్పినట్లు సహజమగుప్రతిభచేతనే జరిగియుండును.

మఱియుఁ బద్యమున నడక యెచటనైనను గుంటువడకుండుట, సమయానుకూలసంభాషణచాతురి మున్నగునవి రసగంగాధరకారాదులు చెప్పినట్లు గురుదేవతానుగ్రహమున లభించియుండును ఇట్టికవిలక్షణము లు వీరియెడఁ గలవు.

ఇంక నొక్కమాట:—ఏయొకటి, రెండు తెలుఁగువ్యాకరణగ్రంథ ములనో శ్రీశాస్త్రిగారు సవిమర్శముగాఁ బరిశీలించినయెడల నిఁకఁ దమ గ్రంథముల నొరులకుఁ జూపనక్కఱలేకయే ప్రకటించుకొనవచ్చును. కావున నట్లు చేయుచు నింకను నుత్తమగ్రంథములచే నాంధ్రభారతి నారా ధింపవలసినదని శ్రీశాస్త్రిగారికి సలహా నిచ్చుచున్నాను.

ఇట్లు.

అవ్వారివాసుదేవశాస్త్రి

# భద్రాయువు

## ప్రథమాంకము.

ప్రథమరంగము:— దుర్గనగరరాజభవనము- (ప్రవేశము) దశార్ణదేశాధీశ్వరుఁడైన వజ్రబాహుఁడు (స్వగతముగఁ జింతించుచు)

వజ్ర॥ అకటా! ఇంతకాల మపక్రమవిక్రమంబున శత్రురాజుల నొంచి గడించిన యీసామ్రాజ్యవైభవములన్నియు నాయనంతర మెవ రనుభవింపవలసియున్నదో కదా! అన్యులకై యేల యిట్టి కష్టనిష్ఠురము ననుభవింపవలయు? అయ్యో! యౌవనమదగర్వాంధుఁడనై వయఃపరిణామంబును గణింపక కాలము వ్యర్థమొనరించి యిపుడు చింతించినఁ బ్రయోజనమేమి?—కట్టా! చింతగాక మరియేమి? "అపుత్రస్య గతిర్నాస్తి" యని శాస్త్రము లుగ్గడించుచున్నయవి.—ప్రపంచమంతయు శైశవానందకందళిశుసలాలనమున సంతోషపరాకాష్ఠ నందుకొనుచున్నది. మహారాజునయ్యు నిస్సంతానుఁడనై కుందికృశించి పున్నామనారకబాధాపరీతాత్ముఁడను గావలసినదేనా! హా! పరమేశ్వరా! జగద్బంధూ! ప్రమత్తుఁడనై యింతదనుక నిన్ను మఱచి మదీయభావిభాగధేయం బెఱుంగనైతి. దీనావనా! నీవు భక్తపరతంత్రుఁడవును, పరమదయాళుఁడవుగాన

ఉ॥ పంతము మాని నాపయిన • పారకృపారస ముప్పతిల్లఁ స
త్సంతతి నిచ్చి వంశ మని • శంబును వృద్ధినిఁ బొందఁజేసి ని
శ్చింతత నీపదాంబురుహ • సేవ నొసంగి తరింపఁజేయు మో
శాంతదయాంతరంగ శివ • సాంబ; హరా! పరమేశ! యీశ్వరా!

(మంత్రి జయసేనుఁడు ప్రవేశించి)

జయ॥ (నమస్కరించుచు) మహారాజులకు జయమగుఁగాక! దేవా! ఏమి
ది: నేఁడేదియో యొకతీరున నుండిరేల: తామెంతవరకును సభా
వనంబునకు రామి, వెదకికొనుచు వచ్చితిని, ఎంతటి యాపత్సమ
యములనైన విషణ్ణత నొందని మీ ముఖపద్మ మట్లు వసివాడిన
దేమి? భృత్యులయపరాధమా? శత్రురాజన్యదౌష్ట్యమా?

వజ్ర॥ (నిస్పృహతో) జయసేనా: కూరుచుండుము.

జయ॥ చిత్తము (కూరుచుండును)

వజ్ర॥ సచివోత్తమా! మానవకృతాపరాధదౌష్ట్యముల కీవజ్రబాహుఁ డంత
గాఁ జింతించువాఁడు కాఁడు. నీయట్టి విజ్ఞానబలపరాక్రమసంపన్నుఁ
డు ప్రెగ్గడయైయుండ ప్రాజ్యసామ్రాజ్యవైభవముల కేకొఱతయు
వాటిల్లదు కాని—

ఉ॥ వైభవ మెంతయున్న నన • పాయత కల్గిన రాజ్య మేలినన్
బ్రాభవభోగసౌఖ్యముల • పారము లైనను మాన్యుఁ డైననున్
లోభి కురూపియైనఁ గడు • రుగ్ణశరీరియునైన టీవిఁ చెన్
వైభవ మాత్మసంతతియె • వాంఛితముగా గద మంత్రిసత్తమా:

అగుట ననపత్యతాదురితనివారణార్థ మెన్నియో నియమవ్రతదానం
బులొనరించియు విఫలమనోరథుఁడ నైతిఁ గదా!

జయ॥ మహాప్రభూ! భగవానునిలీల లతి విచిత్రములుగదా! దేవాసురగంధ
ర్వాదులేయతనిమాయఁ దెలియఁజాలరనిన మానవు లెంతటివారలు?

ఆ॥ వె॥ కలిమిఁ గలుగువాని • బలుబాములను ముంచు
బీదవాని నరసి • పెద్దసేయు
ధనికుఁ డైనవాని • ననపత్యు నొనరించు
పేదవాని కొసఁగు • పెక్కుసంతు.

ఎంత చింతించినను వంతయేకాని సుంతయైనను ఫలము లేదు. దేనికిఁగాని శుభసమయ మాసన్నము కావలయు. మానవుఁడు గృతార్థుఁడు గావలయు.

(సేవకుఁడు ప్రవేశించును)

సేవ॥ దేవా! ఎవరో యొకమునీశ్వరుండు కోటలోనికి వచ్చుచున్నాఁడు

[నిష్క్రమించును]

వజ్ర॥ జయసేనా! ఎవరైయుండును?— ఎవరైనను తపోధనులు పూజ్యులగుట మన మెదురేగి స్వాగత మొసంగుట మంచిది లెమ్ము!

(ఇరువురు లేచి నిలుచుందురు. ఋషభయోగీశ్వరుఁడు శివగానముతోఁ బ్రవేశించును)

వజ్ర॥ [నమస్కరించి ఆసనమును జూపుచు దేవా! అం దాసీనులుకండు

ఋష॥ అభీష్టావాప్తిరస్తు (కూర్చుండి) మీరును సుఖాసీనులుగండు!

వజ్ర॥ (కూర్చుండి) ధన్యోస్మి! మహనీయా! భవదీయాగమనమున మదీయగేహదేహము లతిపవిత్రత నందినవి.

చం॥ మునివర! నీదురాక కడు • మోదము గొల్పెను నాదుమానసం
బున కనయంబు మీ రిటనె • పూజ్యత మీఱ వసించి మాదువం
దనము లజస్రమున్ గొనుచు • తావకపూర్ణకృపోపలబ్ధి మా
జని సఫలంబుగాగ మముఁ • జయ్యనఁ బ్రోవుడు తాపసోత్తమా! ॥

ఋష॥ రాజా! భవదౌదార్య మపారము. మాదృశులయెడఁ గలభక్తియు చాలు. మే మొక్కెడనే వసింపరాదు. తీర్థయాత్రాపరతంత్రుఁడనై త్రిమ్మరుచు దైవికముగ నేఁ డీనగరంబునొచ్చి, సుగుణాఢ్యుండవని విని ని న్నాశీర్వదింప వచ్చితి. జనవరా! నిరంతర పరమేశ్వర చరణసేవాపరతంత్రుఁడవై, గోబ్రాహ్మణశుభాకాంక్షివై ప్రజల సమవాయంబు సధర్మయుతంబుగఁ బరిపాలింతువే? శత్రురాజన్య దౌష్ట్యము లెవ్వియు నిన్ను బాధింపవుగదా? సతీసుతసమేతుండవు ననారతంబు ననామయుండవై సుఖింతువే?

వజ్ర॥ దేవా! భవదాశీర్వచన మమోఘమగుఁగాక! నా కన్నిట నిరామయమం
బె నాయెడఁగినంతవట్టు నిజయ పేసిసహాయుండనై ధర్మ్యము
బగనే రాజ్యపాలనం బొనర్చుచుంటి నని తలంచెద—కాని [తల
వాల్చి నిట్టూర్పు విడచును]

జయ॥ మహాత్మా! భవత్కృపవలన నింతవనుక మామహారాజున కేమిట
నుఁ గొఱతలేదు కాని సర్వమానవసమాకాంక్షణీయంబగు సంతాన
ఫలమే, యియ్యనఘునకు దుర్లభమైనది. సతీత్రయయుతుండయ్యు
సుతరహితుండై యిహపరానందదూరత ననారతంబు మరిపిల్లుచు
న్నవాఁడు. తమదాకకుఁబూర్వమావిషయమే చింతించుచుంటిమి.

ఋష॥ ఓహో! వజ్రబాహుండు నిస్సంతానుఁడా? [దివ్యదృష్టినిఁజూచి] రా
జా! యుష్మత్పూర్వాకృతదుష్కృతవిశేషంబునం జేసి యింతదనుక
ననపత్యతాదురితంబునఁ బొరలితివి. దుర్దినంబులు గతంబులయ్యె
శుభసమయ మాసన్నము గానున్నది. ప్రారబ్ధం బపనయింపనొక
శివాలయనిర్మాణం బొనరించి, యాగమోక్తవిధిఁ బార్వతీపరమేశ్వ
రుల నందుఁ బ్రతిష్ఠించి, నిత్యార్చనాదివిధుల కాచంద్రార్కమగు భూ
దానంబు లొసరింపుము నిరంతరపరమశివధ్యానంబున సంతసించు
చుండుము. అనతికాలంబుననే వంశవిస్తారుఁడగు కొమరునిఁ బడ
యఁగలవు ఇంతకన్న నింకేమియు నుడువరాదు. మా కనుష్ఠాన స
మయ మగుచున్నది. పోయివచ్చెద [లేచి నడచుచుండును]

వజ్ర–జయ (లేచి ఋషభయోగికి నమస్కరించి) దేవా! సెలవు

ఋష॥ దైవానుగ్రహప్రాప్తి రస్తు. మీ రింక నిలువుఁడు, (నిష్క్రమించును)

(వజ్రబాహు జయ సేనలు యథాస్థానముల నాసీనులగుదురు)

వజ్ర॥ జయ సేనా! నేఁడెంతయు సుదినము, మహాత్ముల సందర్శన మాయెక
దోదుసుమా!

జయ॥ రాజా! మహాత్ము లూరక వత్తురా?

వజ్ర॥ కావున, నేఁడే ధనాగారమునుండి యావశ్యకమగు ధనమును గైకొ
ని యుక్తిమంత్రుల రావించి దైవజ్ఞనిర్దిష్టమగు సుముహూర్తంబు
న శివాలయనిర్మాణారంభము గావింపుము. నే నీశుభసమాచార
మంతఃపురంబున కెఱింగింపఁ జనియెద.

(అనుచు లేచి వేఱొకవైపుగ నిష్క్రమించును)

తెరవాలును.

## ద్వితీయరంగము

శివాలయము — లింగాకారము నెదుట వజ్రబాహుఁడు మో
కరించియుండ, నొకవైపున బ్రాహ్మణులు, నొకవైపునజయసేనా
దిమంత్రులు భటవర్గము (ప్రవేశింతురు.)

వజ్ర॥ పరమేశ్వరా! జగత్పూజితమగు నీసేవనమున నను ధన్యు నొనరింపుము

మ॥ కరముల్ మోడ్చితి నేమి సేయుటకు సం • కల్పించినావో దయా
పర నీచిత్త మెఱుంగఁజాల నికనా • భాగ్యంబదేమందమో
పరమేశా! నను నెప్డు ప్రోవఁగల యా • భారంబు నీదేసుమీ
పురుహూతార్చితపాదపద్మయుగ! శం • భూ! దైవచూడామణీ!

మ॥ అనిశంబున్ హృదయాంబుజంబున నినుఁ • ధ్యానించుమన్ నాదునె
మ్మనముఁ నీకు సమర్పితంబుగను స • మ్యగ్భంగి నీనామకీ
ర్తనముఁ జేయుదు నన్య మే నెఱుఁగ స • ర్వజ్ఞుండవీ వేవిధం
బున రక్షించెదొ నీదుభారమిఁక శం • భూ సర్వలోకేశ్వరా!

(లేచి అందఱకు నమస్కరించుచు)

ఆచార్యయుక్తప్రాప్తకార్యక్రమప్రవరులారా! నమోవాకములు. పరమే
శ్వరకరుణావిశేషంబునను, భవదనుగ్రహంబునను గృతార్థుండనైతి. జయ
సేనా. విశ్వేశ్వరుని నివేదనము నిత్యార్పణాదికములకు వలయు భూ
దానం బొసఁగి వీరి సంచితమును యథోచితతాంబూలములఁ దనుపవలయు.

జయ॥ ప్రభూ! జగద్రక్షకుండగు పరమేశ్వరుని ప్రతిష్ఠింపఁ ధన్యులైతిరి.
స్వామి కైంకర్యములకు వలయునెల్ల వారివారియభీష్టానుసారము
భూదానంబు లొసంగఁబడియె. పత్రములన్నియు లిఖింపఁబడినవి.
భవదంగీకారమైనపిదప ముద్రాంకితమొనర్ప నెంచితిమి. సత్రశాల
నన్నియుఁ దీర్చికొందము. భోజనసంతర్పణసమాగతజనకోలాహ
లంబుచే దిక్కులు పిక్కటిల్లుచున్నయవి. తమరు కొంతవిశ్రాంతిఁ
గైకొనినపిదపమిగిలిన యక్కఱల విచారింతము.

వజ్ర॥ జయసేనా! విశ్వేశ్వరుని యనుగ్రహమున్న విశ్రాంతి కేమికొదవ?
వీరల వీడ్కొల్పినఁ గాని క్రతుసమాప్తి గాఁజాలదు.

బ్రాహ్మ॥ మహారాజా! మహోత్కృష్టమగు జగదీశ్వరప్రతిష్ఠ నొనర్చితివి.
వితరణఖనివై విఖ్యాతి నందెదవుగాక. సాహసౌదార్యాదిసుగుణ
మణిమగు నిన్ను బరమేశ్వరసన్నిధానమున నాశీర్వదించి మేమును
గృతార్థులమై వీడ్కొనెదము—

బ్రాహ్మణు లందఱు నేకకంఠమున నాశీర్వాదమంత్రములఁ జెప్పుదురు.

తెర వ్రాలును

## తృతీయరంగము

(అంతఃపురమున వజ్రనాభుని ద్వితీయభార్య ప్రభావతి ప్రవేశము)

ప్రభా॥ (చింతించుచు) అకటా! దైవ మెంత చేసెను! నిస్సంతానుఁడై నూ
తనక్షేత్రము నర్థించిన యీమహారాజునకు నాజననీజనకులు మరా

కాపురమున్నట్టి నన్నేల యిటులఁగనవైతి! ఒకసారి హో: రాజాంతరిటితో
ఢృష్టినొంచిన మిటల నీమాటలెట్టులు వినును గోరును మూదప
భార్యగా నేల స్వీకరింపవలయు? స్వీకరించెం బో: మే మిఱువుర
మిట్టియుండ నీవు డాపెద్దమ్మ నేల గర్భోత్పత్తి కావలయు: అ
య్యయో! ఆమెకే. సంతతి కలిగిన రాజు మమ్ముఁ గన్నెత్తియైనఁ
జూచునా? హా! దుర్విధీ! నాకేల యిట్టిసవతిబాధఁ గల్పించితివి?

రాజు మూఁడవభార్య మాలతి ప్రవేశించును. ప్రభావతి
కూర్చుండుమని సైగచేయును.

మాల॥ అక్కా: ఇదేమి! నీముఖపద్మ మట్లు విన్నదనంబు నొందినదేమి:
విచార మనునది యెఱుంగని నీవు నేఁ డట్లు చింతింపఁ గతంబేమి?

ప్రభా॥ సోదరీ: నాకే యననేల? ఈపరితాపము నీకుమాత్రము వలదా?
సాత్నసపత్నుల మిట్టియుండఁ బెద్దమ్మ రాజమాత కానున్నది
కదా? ఇది చింతాకరముగాక సంతోషకర మగునా? నీకావిచారమే
లేనట్లు తోచుచున్నది?

మాల॥ అక్కా: నిజమేకాని— మన మిపు డేమిచేయుదము? మనప్రారబ్ధ
మిది. ఆమె యదృష్ట మది. సంతులేనిరాజుంగు పై నింటులు పెండ్లి
యాడఁ జేతనైనదికాని, సవతులకు సమఫలం బీయనేర్చెనా? ఇం
తకు నీదొనఁగంతయు మనజననీజనకులదేకాని వెఱుకాదు

ప్రభా॥ అమ్మాయీ: నీవ ట్లనఁ జెల్లదు. రాజు— సంతానార్థి యయ్యేకదా
మనల నపేక్షించినది! ఇంక మనజననీజనకులో!— మనక్షేమం బభి
లషించియే యిటు లొనర్చిరి, ఇందు వారిదొసఁ గిసుమంతయు
లేదు. మనలఁ బెండ్లియాడుసంతతనుక నట్టియుండి యిపు డీగయ్యా
ళి చూలాలగుటయే తప్పు. ఇందుల కేదేని ప్రతిక్రియఁ గావించి
తీరవలయు.

మాల॥ ఔనుగాని అక్కా! మన మిపు డేమిచేయఁ గలము? సమయము మించిపోయినది. తొలుతనే మన మారాజును కౌఁగిలు గీచినచో నీపాటు రాకుండెడిది.

ప్రభా॥ పిచ్చిదానా! అటు లొనర్చి యూరక జనాపవాదములకు మన మేల పాత్రులము గావలయు? చేతనైన నిపుడుమాత్ర ముపాయాంతరము లేదా?

మాల॥ అక్కా! ఆ వేదియో యెఱింగించి నాకుఁ గూడ సంతసముఁ గూర్పవా? ఈవిషయమున నిద్దరము సమభాగులమే కదా!

ప్రభా॥ (రహస్యముగ) మాలతీ! ఈవిషయ మెన్నఁడును బొక్కరాదు. నీవు వట్టి పిచ్చిదానవు. రహస్యముసుమా!— ఇంక నైదాఱుదినములలో నామెప్రసవ మగునట్లు తోచెడిని. కావున తక్షణ మేదే నొక తీవ్రతరవిషప్రయోగ మొనర్చి మృతశిశువును బ్రసవించునటు లొనర్పవలయును.

మాల॥ అక్కా! అటులఁ జేసిన మంచిదేకాని. దైవగతి తప్పి శిశువు జీవించి మనగుట్టు బైటబడినచో రాజు మనల బ్రతుకనిచ్చునా? పౌప లందఱు మనలఁ దిట్టిపోయరా?

ప్రభా॥ చెల్లీ! నీ కాసందేహము వలదు. శీఘ్రప్రసవ మగునను నెపంబున పరమాన్నమునం దావిషము మిశ్రిత మొనర్చి యిప్పించినచో నా రహస్యమును ధన్వంతరియైనను గ్రహింపఁజాలఁడు.— కాని— విషసంపాదన మెట్లాయని—

మాల॥ (వినీతభావముతో) అక్కా! కొండొకకారణార్థమై నే నది సంగ్రహించి భద్ర మొనర్చితిని. అది నీ కొసంగెద. నీ వెటులైన నొనర్చి కృతార్థురాలవు కమ్ము.

ప్రభా॥ ఔమ్మ! తక్షణము తీసుకొనిరమ్ము.— చేతనయ్యెఁ జేతఁగాని

వారివలె బాహ్యపుణ్యముల గణించుచు నాత్మవినాశన మొనర్చుకొను వారలే యువిదలు.

మాల॥ (లోనికిఁ బోయి యొకవిషపుబరణి దెచ్చి యిచ్చును.)
అక్కా! ఇది తీవ్రతరమైన గరళము జాగ్రత్త! ఘ్రాణేంద్రియముఁ జేరినమాత్రముననే, మైకము గలుగఁజేయును. ఎంతటిబలీయమైన జీవియైనను నిది నాలుకకుఁ దగిలించెనో, యమాలయముఁ జేరవలసినదే.

ప్రభా॥ మాలతీ! నేఁడు నిజముగ నీవు రాజకాంతవు. మన జీవనము సుప్రభాతము. ఇంక మనమనోరథము లీడేరిన ట్లే తలంపుము.

మాల॥ ప్రభా! ఈవిషయము మనయిరువురియందే యుండవలయు. మూఁడవకన్నెఱింగినచో నుభయులకును సర్వనాశనము తప్పదు.

ప్రభా॥ పిచ్చిదానా! అదియే నేనును జెప్పునది. లోకవృత్త మంతగా నెఱుంగనిదానవు. రాజు కడుచతురుఁడు. మాటలలోనే మనభావము నెఱుంగగల ధీమంతుడు. సంభాషణలయందుఁ గడుజాగ్రత్తగ మెలంగ వలయును.

మాల॥ అక్కా! నీవు నా కంతగాఁ జెప్పఁ బనిలేదు. వృద్ధరాజునకు నే ననిన నెంతయో విశ్వాసము. ఒకవేళ నెంతటియలుక వొడమినను మందలించునుగాని మిగులఁ గోపపడునలవాటు లేదు. అయినను నాతనికడ నీప్రసక్తి యేలవచ్చును?

ప్రభా॥ ఆ! అటు లనుకొనుచుంటివా? మంత్రి జయసేనుఁడు మిగుల తెలివిగలవాఁడు. రాజాంతఃపురరహస్య మంతయు నాతనిచెవి వైచుటయు నతఁడు తద్రహస్యభేదన మొనర్చి రాజున కాలోచన చెప్పుటయు నివియే వారియనుదినగోష్ఠికలాపములు. అపరాధపరిశోధనయం దతఁ డాఱితేరినబంటు. అందువలననే రాజున కాతనిపై నను రాగము మెండు. కావున రాజుకడ జాగ్రత్తగ మెలంగు టుచితము.

మాల॥ సోదరీ! నీకానందము మేలా? నేఁటిరాత్రి రాజనందనుఁ ప్రాణహరమునై
త మొసంగక యనారోగ్యము నటించుచుంటిని. రేపు ముందుగనే
వానిచేఁ జెప్పించి మందిరప్రవేశము నైతము వారించుదు.

ప్రభా॥ అమ్మా! అదేమిపని అటు లొనర్చిన రాజనందనుఁ కనుమానము కలు
గును. బాగుగ, సంతోషముగ నున్నట్టు నటించుము. చెడువారాలోచన
ములనెట్లయిన నాపాటుపడి వదలించుకొనవలయును. ఏమియు
నెఱుఁగనివానివలెనే నటించి నాథుని మన్ననలకుఁ బాత్రురాలవు గా
వలయును. సరియే! ఇంక నీవు పొమ్ము. ఏమనుచున్న ప్రతీకారమున
కుపాయము లేనియుపాయము నాలోచించి కృతకృత్యు నయ్యెద.

(ఇరువురు లేచి చెరియొకవైపునకు నిష్క్రమింతురు - తెరవాలును)

## చతుర్థరంగము:-

మాలతీశయ్యాగృహము (మాలతి శయ్యపై కూర్చుండి యోచించును)

మాల॥ (స్వగతమున) ఆహా! ప్రభావతి యెంతసమర్థురాలు! గుట్టానంత
యైన రట్టు కాకుండ విషప్రయోగ మొనర్చినది. దానంజేసి జననీజ
నకు లిరువురును. తీవ్రవ్రణరుజాబాధితులై యహోరాత్రము
లాక్రందించుచున్నారు. అబ్బబ్బా! అంతఃపురజనం బంతయు
నిద్రాహారములు మానివైచె. ఇంక ప్రభువో పుత్రజననానందంబునఁ
బాత్రదానంబులఁ గావించుకొనుచు నంతఃపురమునకే రాక మైమ
ఱచి యున్నవాఁడు. కానిమ్ము నేఁడైన రాకుండునా? [తెరలో
ధ్వని] ఎవ రాతలుపు తట్టునది? [లేచి తలుపు తీయును]

ప్రభా॥ (ప్రవేశించి రహస్యముగ) మాలతీ! చూచితివా! నానేర్పు. ఆనంద
మంతయు విషాదమయమై పోయినది — నే నిచట తడవు నేయ

రాను. శిరాజీవు డంతఃపురమునకు వచ్చునట. ముందుగ నీయెడకే రాగలఁడు. వచ్చినచో నిచటనే నిలిపి నీనేర్పంతయుఁ జూపి కొల్లి కుమారుల నెల్లి యరణ్యములపాలు గావించునట్లు బోధింపుము. ఆపై సుఖము చెరెసగము. (నవ్వి, మాలతిబుగ్గ గిల్లి వయ్యారముగ నిష్క్రమించును)

మాల॥ (శయ్యపైఁ బరుండినిద్రరాక బాధపడుచున్నట్లు నటించుచుండును)

వజ్ర॥ (ప్రవేశించి మాలతిపైఁ జేయివైచి) ఓహో! మాలతీదేవి నిద్రపోవుచున్నదా యేమి? — మాలతీ! (లేపును)

మాల॥ (ఆవులించి లేచుచు) నాథా! వచ్చితిరా: చిరకాలదర్శనము—దయసేయుడు!— దానధర్మాదికముల బాగుగ నొనర్చితిరా?

వజ్ర॥ ఆ! అమాత్యప్రేరితుఁడనై శాంతికలాపములను, దానధర్మాదికములను నెఱవేర్చితిని. (ఆలకించి) ఆ! ఆదేమి! బాలునిరోదనమా? అంత కర్ణకఠోరముగ నున్నదేమి? అంతఃపురమంతయుఁ బ్రతిధ్వనించుచున్నదే:— ఎప్పటినుండి యి ట్లేడ్చుచు?

మాల॥ నాథా! ఇపుడే కాదు. జననమాది పదిదినంబులనుండియు నహోరాత్రము లిట్లే యాక్రోశించుచున్నాఁడు. విచారింపగా జనసేవకులిరువురు దుర్భరవ్రణశరీరులై నిరంతర మాక్రందించుచుండిరఁట. అంతఃపురజనంబున కంతకు నీపదిదినంబులనుండియు నిద్రాహారములు లేవు, తమతోఁ జెప్పి కొందమన్న దర్శనమైన లేదుకదా! దాసీజనంబును విచారించి యథార్థము తెలిసికొనుఁడు

వజ్ర॥ సరియే నేను బోయి అదేదియో విచారించి, పలసిన ట్లొనర్చెద. నాకిచ్చట నిదుర పట్టునట్లు లేదు.

మాల॥ నాథా! మీ రేమైన నొనర్పుడు. ఇట్లే కొన్నిదినంబు లుండినచో

మేమును రోగశయ్యలఁ జేరుటయో అంతఃపురమున సీతుపద్రవమో తప్పక జరిగితీఱును.

వజ్ర॥ ప్రేయసీ! అంతవనుక నేల? మంత్రిప్రముఖుల నాలోచించి యుచితభంగి నంతఃపురబాధ నివారించెద. ఎల్లి సుఖంబుగ నిద్రింతువు. రమ్ము. పోయివచ్చెద (నిష్క్రమించును)

మాల॥ ఆ! దీనితో మాప్రభావతిసంకల్పము కొంతవరకు ఫలించినట్లే. లేకున్న రే పింకొకయుపాయ మాలోచితుము. (ఆలకించి) అబ్బా! వావుతప్పి కన్ను లొట్టవోయిన ట్టీజననీఁకుపు లెంత బాధపడుచు న్నాయి! వారిబాధ యెట్లున్నను ముందు నాకు శిరోబాధ యగ్గల మగుచున్నది. ఈరాత్రి గడచుట యెట్లో తోఁచకున్నది. ఆ! మఱచితి! ఈసంగతి మాప్రభావతి కెఱింగించి వెంటనే పురోహితాదుల నాజ్ఞాపించవలయును. ఇపు డీరాజు మంత్రిపురోహితులతో మంతన మొనర్పఁ జనియె. ఇంతలో వారల నెవ్విధినైనఁ బ్రబోధించి యీపాపుల ధనరణ్యములపాలు గావింపవలయు. జయసేనుఁడు దూరదృష్టి కలవాఁడు. కాన నాతనివలన నేమియుఁ బ్రయోజనము లేదు. ఇంక పురోహితులో! ధనప్రియులు. కావున వలసినంధన మొసఁగియైన వారలచే రాజునకుఁ జెప్పించి, సఫలమనోరథుల మయ్యెదము.

తే॥ గీ॥ రాజులే యననేల వి॰ రాగులైన
క్షణములో కామినీకటా॰ క్షముల కోడి
దాసులై యలరి మనోర॰ థంబు లొసఁగి
చేయరానట్టి పనులైనఁ॰ జేతు రహహ॥

(నిష్క్రమించును- తెర వ్రాలును.)

## పంచమరంగము:-

(రాజమందిరమున వజ్రబాహుఁడు చింతతో నటు నిటు తిరుగుచు)

వజ్ర॥ ఆహా! మానవుఁ డెంతటివాఁడైన నేమి? ఏ దేనొకచింతఁ బొరల వలసిన దేకదా! అక్కటా నిరంతరరోదనాక్రాంతమగు నంతఃపుర మమంగళప్రదమని పురోహితులు వచించిరి. మంత్రౌషధప్రక్రియల నిరామయుండగునని యమాత్యుఁడు నుడివె. విశ్వాసపాత్రుఁడగు జయసేనునివాక్యములే నమ్మి.

తే॥ గీ॥ ధరణిఁ గలయట్టి మంత్రౌష • ధంబు లన్ని
యేర్చి సమకూర్చి యజ మాన్చ • నెంచినాఁడ
కాని సుంతైన ఫలమును • గాంచనైతి
అంతకంతకు రోదన • మతిశయించె.

(విసుగుతో) ఛీ! ఏమైన నగుఁగాక అంతఃపురజనంబునకెల్ల ననంతచింతాకరంబై మదీయానందలతాలవిత్రములగు నీ సతీసుతులఁ బరిత్యజించి తీరెద— ఎవఁడురా అక్కడ?

సేవ॥ (ప్రవేశించి) మహాప్రభూ! ఏమి సెలవు?

వజ్ర॥ నీవు తక్షణమే వెళ్ళి సారథి నిటకుఁ దీసికొనిరమ్ము.

సేవ॥ చిత్తము! (నిష్క్రమించును)

జయ॥ (ప్రవేశించి) మహారాజా! ఏదియో దీర్ఘాలోచన మొనర్చుచుంటిరి?

వజ్ర॥ జయసేనా! కూర్చుండుము. నాయట్టి మందభాగ్యునకుఁ జింతయ కాక సంతస మెట్లు చేకూరును? నాఁడు నీమాట పాటించి యింత దనుక నోపికవట్టి యెన్నియోచికిత్సల నొనరించియు విఫలమనోరథుఁడనైతి. ఇంక కర్జము లేదు. నేఁడే యాజననీశిశువులఁ బురంబు వెడలించెద.

జయ॥ మహాప్రభూ! సకలధర్మవేమలరగు ఉమకు నేఁ జెప్పఁగలవాఁ చను గాను. తీప్రవడి యిటులొనప్పుఁడ పాడికాదు. అందును బరు లుగారు, పట్టమహిషి–వంశాంకురమగు యువరాజు. వీరలనా అర ణ్యములపాలు సేయుట? ఈయకృత్యము బంధుహింసాకరమేకాక పాపభూయిష్టము గూడను.

వజ్ర॥ జయసేనా! చాలు నూరకుండుము. ఈవిషయమున నీసమాలోచ నము మా కేమియు నక్కఱలేదు నిరంతరమురంతచింతాకల్లోలమున స్కుఁడనై యిటుల నిశ్చయించితిని. గాని వెట్టినై కాదు.

సారధి॥ (ప్రవేశించి) దేవా! నమస్కారము

వజ్ర॥ [తీవ్రతతో] సారథీ నీ విపుడే రథము నాయత్తమొనర్చి పట్టమహిషి ని బుట్టినింటివ్యాజమునఁ గొనిపోయి యరణ్యమార్గమున విడచిరమ్ము!

జయ॥ దేవా! ఇది యనుచితము—— ఆత్మవినాశకరము.

వజ్ర॥ (కోపముతో) జయసేనా! చాలు నీయుపన్యాసము. వజ్రబాహుఁడు కర్తవ్యాకర్తవ్యముల నెఱుంగనియంతటి మూఢుఁడుకాఁడు, నీవెం తటిసచివోత్తముఁడవై నను–అంతఃపురవిషయముల నంతగా జోక్య ము గలుగఁ జేసికొనరాదు.

జయ॥ చిత్తము!- రాజా! నాకు మతి వోయినట్లున్నది. వంశానుస్యూతమగు నీమంత్రిపదవిని వదలుకొనుచున్నాఁడను. ఇంక పోయివచ్చెద సెల వొసంగుము.

వ్రజ! ఆ! సరియే పొమ్ము!- సారథీ: పొమ్ము !—— మీమహారాజు జీవిత మునం ధొకయంక మీవిధముగాఁ గడచినది ఇంకను ననేకచిత్ర ములఁ గాంచెదరు [వెఱ్ఱివానివలె దిక్కులు చూచుచు ] పొండు! అభాగ్యులారా! పొండు మీపురాకృతమిట్లున్నది! నేనేమి సేయుదును?

(సారధి జయసేనులు చెఱియొకవైపుగ మెల్లగ నిష్క్రమింతురు వజ్రబాహుఁడు వెఱ్ఱివానివలె దిక్కులు చూచుచుండ తెర వ్రాలును)

---

# భద్రాయువు

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము

(అరణ్యప్రదేశము. సుమతి బిడ్డ నొడిలో నిడుకొని నడచుచుండును. వెనుక సారథి మెల్లఁగా నడచుచుండును.)

సారథి॥ (ముఖముఁ జేతులతోఁ గప్పుకొని యేడ్చుచు) అమ్మా! మహారాజ్ఞీ!

సుమ॥ (వెనుకకుఁజూచి) ఆ! ఆ! అదేమి! సారథీ! అట్లు దుఃఖించుచుంటి వేల? ఏమైన బాధ గలిగినదా?

సారథి॥ తల్లీ! ఈదుష్టున కంతటిభాగ్యము గూడనా? నేనే మొదల బాధింప వచ్చితిని.—

సుమ॥ సారథీ! అదేమి! నీమాట లాశ్చర్యభయావహములుగ నున్నవి! నీ వెవరిని బాధింప వచ్చితివి? నన్నిట నేల దింపితివి?

సారథి॥ అమ్మా! ఇంత యొనర్చినవాని కింక, దాపరిక మేల? నేటియుదయమున మహారాజుగారు నన్నుఁ బిలిపించి "సారథీ నీ విపుడే రథము నాయత్త మొనర్చి పట్టమహిషిని బుట్టినింటివ్యాజమునఁ గొనిపోయి యరణ్యమార్గమున దించిరమ్ము! పొమ్ము!" అని కఠినముగా నాజ్ఞాపించిరి.—

సుమ॥ హా! [కూలఁబడి నెత్తి మొత్తుకొనుచు] అయ్యో! సారథీ! ఇంతటి కఠినశిక్షకు నే నే మపకృతి యొనర్చితిని?

సారథి॥ అమ్మా! రాజుగారు నాతో ననలేదుగాని నేను చాటున నుండి వినుచుండగా, రాజుగారు మంత్రిగారిని గోపపడుచు "రోదనముతో నంతఃపురమంతయుఁ గల్లోలముగా నున్నది. ఏమైననరే పురోహితులు చెప్పినప్రకారము జననీశిశువుల నరణ్యముల కంపెద" నని

గట్టిగాఁ జెప్పెను. అంతట మంత్రిగారు నే నీకొలువు సేయఁజాలనని
పదవి వదలుకొని వెళ్లిపోయిరి. (కన్నీరు తుడిచికొనుచు) తరువాత
నాతో గట్టిగా నీమాటలను జెప్పి హా! హా! యమ్మనిరి.

సుమ॥ (దుఃఖించుచు) హా! పరమేశ్వరా! ఇదియా, నా యపరాధము? —
అయ్యో! వ్రణబాధితులమై అనేకరోగనానిష్టులమగు మమ్మీవిధి
శిక్షింపఁ జేసితివా? మహారాజా! తుదకు నీదయ యిట్లు పరిణమించి
నదా? ఇంతకఠినుఁడవని తలంపనైతినే!

సారథి॥ అమ్మా నాకు సెలవొసంగుము. నేను పోవలయు. రాజాజ్ఞాప్రకార
మిట్టియకార్య మొనర్చితినేకాని యిందు నాతప్పేమియు లేదు.—
మీరు మరలి వచ్చినను రాజుగా రంగీకరింపఁజాలరు. ఎట్లయిన నీ
యడవిఁ గడచి యొకపల్లెఁ జేరుఁడు. మీరుసుఖంబుగ నుండిన నెప్ప
టికైన రాజుగారికి దయ గలిగి మిమ్మనుగ్రహింపక పోరు. కష్ట
ము లెల్లకాల ముండునా తల్లీ! క్షమించి నా కింక సెలవొసంగుము.
(మెల్లఁగ నిష్క్రమించును)

సుమ॥ అయ్యో! సారథీ! నీవుకూడఁ బోవుచుంటివా? హా! దైవమా! నాకేది
దిక్కు? అయ్యో! మారోదనము విని యేక్రూరజంతువైన వచ్చి
కబళించునేమో! (భయముతో నటునిటుఁ జూచును) ఛీ! పాడుప్రా
ణమా! అనివార్యరుజాబాధితురాలనై, పతిపరిత్యక్తనై, యగతిక
నయ్యు నింక యేటి కీబొందెపై నడియాస?— అయ్యో! ఎట్టి
వారికైన జీవితేచ్ఛ సహజముకదా! పోనిమ్ము. నవమాసములు
భరించి కాంచిన యాచిఱుతకొఱకైన, నుసురులు నిల్పుకొనవలదా!
కానిమ్ము. దైవము, మా నుదుట నెట్లువ్రాసిన నట్లు కాగలదు.
ఓదయామయా! సర్వేశ్వరా!

మ॥ నీసంకల్ప మదేమొకో! తెలియ రా • నీరేజగర్భాదులున్
దోషం బింతయులేని మ మ్మిటుల నీ • దుర్మార్గమున్ జేర్చి నీ

రోసం బంకయముఁ బాసితో! యభవ! దు ◆ ష్ప్రాప్యంబు నీ కేల నా
పాపంతాపము మాన్పఁ బ్రోవఁగదవ ◆ యబ్రహ్మాహి మృత్యుంజయా॥

(తెరలో భయంకరధ్వని)

అమ్మయ్యో! భీకరగర్జారావం బేదియో వినవచ్చుచున్నది: ఇది మే ఘంకము నన్ను బట్టిన దనుకొందునే! ఇంక నాకేది దారి? మఱొక వైపు నకేగెదఁగాక (నడచుచు) అయ్యో మాటిమాటికి నాకి కష్టము వచ్చుచున్న యీ ఘోరసర్పకంటకగుల్మంబులఁ దప్పించుకొని పోవు టెట్లు?

తే॥ గీ॥ అంధతమసంబు క్రూరమ ◆ హారవంబు
కుటిలకంటకకరుటా ◆ గుల్మయుతము
దుష్టమృగసర్పనిబిడంబు ◆ దుస్పథంబు
నైన యీకానఁ దరియింప ◆ నౌనె నాకు?

హా! జగదీశ్వరా! నీ దాపద్బాంధవుఁడ వనుమాట యపహాత కల్పనమా? భక్తరక్షణబిరుదంబు బీత్తయేనా? స్త్రీ శిశుహత్యలు నీకు నిత్యకృత్యములా? నీ వేమో దుష్టశిక్షణ శిష్టరక్షణదక్షుండవని పౌరాణికు లెల్లపు డాడుచుందురే! అవి యెల్ల కల్లలేనా? తండ్రీ! ఇంతటిదురవస్థలఁ బాలుసేయ నే నేమి దుష్కృత్యం బొనర్చితిని? పసితనంబున నజ్ఞానవశంబున నేమి యొనర్చితినోకాని, పెద్దనై ప్రపంచజ్ఞాన మెఱింగినతఱువాత నెవ్వరికి నెట్టియపకృతియుఁ జేసి యెఱుఁగనే! సంతాన వ్యాజంబున భవదీయ వ్రతదానజపంబు లెన్నియో యొనర్చితినే? ఇట్టి నీయాపదపాపిని కట్టా! బెట్టిదంపుటిడుములఁ గుడిపించి ముచ్చిసుచుంటివా? ఇంతకన్న మాయిఁదుపుప్రాణంబు లొక్కపరిహరియించరాదా! (కండ్లు మూసికొని ధ్యాననిమగ్నయై మఱల కండ్లు తెఱచి ప్రక్కకుంజూచి) ఓహో! అదేమి! అప్రక్క నేదియో వెలుతురు కానవచ్చుచున్నదే! అచటికే గిన నేమైన దారిదొఱకునేమో! కరుణామయా! అపరాధిని క్షమింపుము. ఇదకీవిధముగ దారిఁజూపి నన్నుద్ధరింప నెంచితివా పాహి మాం! శరణాగత రక్షక! పాహిమాం!

(నిష్క్రమించును)

## ద్వితీయరంగము

(వైశ్యపురరాజవీథి— బాలుని నెత్తికొని సుమతి ప్రవేశము)

సుమ॥ (స్వగతమున) ఆహా! పరమేశ్వరా! నీలీలలను తెలిసికొన
ములుగదా! అంతఃపురంబున నిశ్చింతతను మెలఁగుచున్న మమ్ము శ్రీ
వజాధిపుల నొసఁగి రాజాగ్రహమునకు గురిచేసి మహారణ్యమున
భయానకదృశ్యములఁ జూపించి యిప్పటి కీగతిఁ ద్రిప్పితివా?
ఇంకను ముందెట్టి యిడుమలఁ గల్పింప నుంటివో కదా! జగద్రక్షకా!
నీపరీక్ష కంతము లేదా?

సీ॥ చిన్న మొన్నటిదాక ♦ నన్నెట్లు ప్రోచితో
కలకాల మట్లె ♦ కావుమయ్య!
ఏపాప మెఱుఁగని ♦ నాపాప నెట్లైనఁ
గాపాడి సత్కీర్తిఁ ♦ గనఁగవయ్య!
ఏనాటికైనను ♦ నానామపదపద్మ
సేవల లభియింపఁ ♦ జేయుమయ్య!
నీనామభజనమే ♦ నిరతంబు మదిఁగొల్చి
నాపాపనిచయంబు ♦ వాపుమయ్య!

తే॥ గీ॥ ఎట్టికష్టసమూహంబుల ♦ నేని గూర్చి
నన్ను బాధింప భరియింతు ♦ గాని తుదకు
నీపదసన్నిధినిఁ జేర్చి ♦ మోదమెసఁగ
వేడుచుంటిని గౌరీశ! విశ్వనాథ॥

అబ్బబ్బా! అంతకంతకు బదములబాధ మిక్కుటమై నిప్పులఁ ద్రొక్కినట్లున్నది. ఇంక నొక్కయడుగైన నిడఁజాల. ఎట్లో మహారణ్యము గడచితిని. అదె మధ్యాహ్నసమయము కావచ్చుచున్నది. ఈనాటి కీపురమునఁ గడపి వలువాతఁ బయనమయ్యెదఁగాక. (ప్రక్కకుఁ జూచి) ఇదిగో! ఈయరుగుపై విశ్రమించెద (అరుగుమీద కూర్చుండి) ఆహా!

పాంక్తికనకల్పవల్లి యనఁదగు నీయు ల్లేమహానీయునిచోకదా? (ఒడిలోని పిల్లవాఁ దేమ్పను) అయ్యో: "పూసినకర్మము పొరుగూడు పోయినను ఁ దప్పు" దన్న ప్లేపాపఁ డింకను నేడుపు మాన కున్నవాఁడు. లాలించుచు నాయనా! ఏడువకు! పసిడియుయ్యాలలోఁ బట్టుపాన్పుపైఁ బండి దాదులచే నూఁచఁబడఁదగిన నీవు .. నిన్నుఁ గనిన మందభాగ్యవశంబున నేను నీ బిడ్డ మారులమై యిట్లు సంతాప మందుచుంటిమికదా! ఈనేడుపురేకదా! మనల నింతదూరము గొనివచ్చినవి! ఊరకుండుము.

( లోపలినుండి దాసి యొకతె ప్రవేశించి)

దాసి॥ ఎవరమ్మా: నీవు అయ్యో! అదేంటి ఆపిల్లా పల్లా యేడుస్తున్నావేం?

సుమ॥ అమ్మా! నే నొక దురదృష్టవంతురాలను. దైవకృపవలన నదివుల గడచి యీయెడ కటుదెంచితిని. మార్గాయాసము మిక్కుటముగుట నడువలేక యీనాఁ డిచ్చట విశ్రమించి పోవఁదలంచితిని. ఈకు అని యేడుపువలననే మా కీగతి పట్టినది —అమ్మా : ఈసౌధ మె వ్వరిది ? మాయునికి మీ కేమైన బాధాకరమైన నింకొకచోటి కేగె దను. క్షమించి యీనాటి కిచ్చటఁ బసుండ నిచ్చెదరా ?

దాసి॥ అమ్మా! మీ రెవరో గొప్పోరింట్లే యున్నారు. ఈమేడ పద్మాకరయ్య గారిది మాసాహుకారుగారు చాలామంచోరు ఓచోటివా రొక్క పూటపంచలో పరుంటే అరిగిపోతుందాయేం? ఉండుండు మావాబ య్యగారిని పిల్చుకొత్తాను (నిష్క్రమించును)

సుమ॥ [స్వగతముగ) ఇది యీయింటిదాసివలె నున్నది. దీనియజమాని చాలమంచివాఁ డని చెప్పుచున్నది— ఆయనవచ్చి యేమనునో! సర్వేశ్వరుఁ డింకను నెట్టియిక్కట్టులఁ గప్ప నున్నవాఁడో కదా!

( పద్మాకరుఁడును దాసియుఁ బ్రవేశించుదురు)

పద్మా॥ (సుమతిని బరిశీలించి) తల్లీ! నీ వొకగొప్పయింటియిల్లాలివని నీము ఖము చెప్పక చెప్పుచున్నది. నీ కిట్టికష్టము లేల సంప్రాప్తించెనో యెఱుంగ వచ్చునా ?

నుపహారము లొనర్చుచు సంతసము గూర్చుము మానసులకు మఱి
యొకరిని నియమించెద. అమ్మా లోనికి రమ్ము:

సుమ॥ (బిడ్డనుజూచి) హా! తండ్రీ! ఇది యేమి? ఇట్లు కొయ్యఁబారి పోవు
చుంటివి (పరీక్షించుచు నాతని చూచి) అయ్యో! శరీరమంతయుఁ జల్లఁ
బడుచున్నదే! పెదవులు నల్లఁబడిపోయినవి! కన్నులు తిరిగిపోవుచు
న్నవి (బిగ్గఱగా నేడ్చుచు) హా! కుమారా! నన్ను వదలి పోవుచుం
టివా? తండ్రీ! నీకొఱ కయ్యేకదా: పతిపదభక్తినయ్యు దుర్గమ
కాంతారముల నెల్లో యుసురుల నిలిపికొని శ్రమించి తుద కీపుర
ముఁ జేరితిని. అయ్యో! ఈవైశ్యసత్తముఁ డింతకమున్నె కదా!
నీకు విద్యాబుద్ధులఁ జెప్పించెద ననియాస్య నొనరించుననియె. హా! కు
మారా! — అయ్యో ఇంకెక్కడి కుమారుఁడు! (మూర్ఛిల్లును)

పద్మా॥ (బాలుని సమీపించి స్వగతముగ) అయ్యో! ఈబాలుఁడు మరణించి
నాఁడే! పాప మీమెప్రారబ్ధ మిట్లున్నదికాబోలు! (ప్రకాశముగ)
అమ్మా! ఊరడిల్లుము. ఎంత చింతించి యేమి ప్రయోజనము?
"ఋణానుబంధరూపేణ పశుపత్నీసుతాలయాః" అనున ట్లీబాలుఁ
డింతవరకే నీఋణమును దీర్చికొని పోయినాఁడు. భగవానుఁడు
దయఁదప్పె నేమిసేయుదుము!

సుమ॥ (మూర్ఛఁదేరి దుఃఖించుచు) అయ్యో! తండ్రీ ఇంక కర్తమేలేదా?
నాబిడ్డ నిడఁగల మహనీయులే లేరా? జగద్రక్షకా! విశ్వేశ్వరా!
నిరంతరభవదీయచరణానుస్మరణఫలితం బిదియా? (పద్మాకరుని
జూచి] తండ్రీ! పద్మాకరా! ఊరక యేల నట్లు చూచెదవు? గ్రామ
ములోని వైద్యులఁ బిలువ నంపుము, నాకుమారుని బ్రతికింపుము.
బ్రతికెనేని యాజీవాంతము నీకుఁ గృతజ్ఞులమై సేవించెదము. నా
యనా! ఆర్తత్రాణత్వ మార్యధర్మముగాదా: దారిపోవువారని నిరసిం
పకుము. తండ్రీ! తడవైనచోఁ దనయుఁ డీలోకము వాసిపోవునే
మో! త్వరపడుము. పుత్త్రభిక్ష యొసంగుము తండ్రీ!

పద్మా॥ అమ్మా! ఇం కెక్కడితనయుఁడు! ఆజీవము చెప్పడో పోయినవి. నీకుఁ గలయనురాగముకొలది వాపోవుచుంటివికాని మఱియేమియు లేదు. అయినను ప్రయత్నలోప మేల?— దాసీ! నీవు పడినడిగ నేగి యూరంతయుఁ దిరిగియైన గొప్పవైద్యులనుగాని, కనుపించిన యోగులనుగాని తీసికొని త్వరగ రమ్ము! పొమ్ము!

దాసి॥ [తల యూచుచు] అట్లాగే బాబయ్యా! [లోనికరిగి మరల వచ్చి] బాబయ్యా! ఎవరో బైరాగి! గొప్పోరులా యున్నారు! ఈదారినే పోతున్నారు. రండి మీరు పిలువండి (ప్రక్కకుఁజూచి) అదుగో ఇటే వచ్చుచున్నారు.

(ఋషభయోగి శివగానముతో నొకప్రక్కనుండి ప్రవేశించును పద్మాకరుఁడు ఎదురేగిపోయి మునిపాదములపైఁ బడును)

ఋష॥ [పద్మాకరుని లేవనెత్తి] అభీష్టావాప్తిరస్తు! అయ్యా ఎవరు నీవు? మా వలన నీకుఁ గావలసిన ప్రయోజన మేమి?

పద్మా॥ (నమస్కరించుచు) మహాత్మా! తమరు తపోధనులు. మహాయోగులు. మీకుఁ దెలియరాని విషయము లుండవు. అయ్యా! అటు చూడుఁడు ఆమె యొకపాంథురాలు శిశుసహితముగ నిప్పుడే మాయింటికి వచ్చినది నే నామెనాదరించుచుండగనే యాశిశువు మరణించినాఁడు. దానిగలుగ విలపించుచున్నది. నేను వినలేకున్నాను మీరు దయచేసి జ్ఞానోపదేశంబున నోదార్పుఁడు నామనవి మన్నింపుఁడు

ఋష॥ (మెల్లఁగ సుమతిని సమీపించును)

సుమ॥ [కన్నెత్తి చూచి యోగికి నమస్కరించి] దేవా! నమస్కారము. పాహి మాం! మాం రక్ష! శిశుం రక్ష! ఆపద్బాంధవా! ఆర్తశరణ్యా! అగతికనగు నన్నుద్ధరింపుము. పుణ్యమును గొనుము మిమ్ము వీక్షించిన యానందాతిరేకంబున డగ్గుత్తిక పడితిని. క్షమింపుడు. ఇం కేమియు నుడువఁజాల [నమస్కరించి కండ్లుమూసికొనును]

ఋష॥ [స్వగతమున] ఓహో! ఈయమ వజ్రబాహునిపట్టమహిషి ఈబా

డు మదీయవరప్రసాది. నాయీప్రయాణ మిందులకే యైయుం
డును. (పైకిఁ జూచి) దేవా! నీసంకల్పములతి విచిత్రములుగదా:
—తొలుత నీమెకు జ్ఞానోపదేశ మొనర్చి యావలఁ గర్తవ్యము
విచారించెద [ప్రకాశముగ] సాధ్వీ! ఏల చింతించెదవు? సృష్టిక్రమం
బెఱింగిన నీకీవిచారము తొలఁగును. సావధానవై గ్రహింపుము.
"సర్వేశ్వరుఁడు ఆదిమధ్యాంతశూన్యుఁడు. లీలామయుఁడగు నత
నిసంకల్పమే యీసృష్టి. అతఁడు మాయాదేవి నాధారించి దేవగం
ధర్వమానవపశుపక్ష్యాదులైన జీవములను, తరుగుల్మపాషాణాది
స్థావరములను సృష్టించి విడచె. ఈజీవులన్నియు నతనియాధార
మాత్రంబులేకాని వేఱుకాదు— యుగనిర్మాణముకొఱకుఁ బ్రాణు
లకుఁ గర్మ విధించి వారివారికర్మఫలానుసారములగు జన్మల నొ
సంగుచుఁ గాలమును దీర్ఘ మొనర్చును. అంతియగాక తాపత్రయ
ము. అరిషడ్వర్గము మొదలగుమాయాజాలమంతయు వినియోగించి
జీవుని ముక్తివిముఖు నొనరించుచున్నాఁడు అట్టిమాయాతీతమగు
ప్రాణియే మోక్షార్హమైనది. తత్క్షణమున నీవలెఁ బుత్రశోకమును నను
భవించువార్లు లీప్రపంచమున వేలకు వేలుండిరి. కాని పరమేశ్వరుఁ
డందరికోరికల మన్నించినచో మఱియొక బ్రహ్మాండమును సృష్టింప
వలసివచ్చును.

చ॥ కావున నీదుపూర్వభవ ♦ కర్మఫలంబున రాజకాంతవై
వెలసితివందు పట్టభుజు ♦ దేవిగనై సుఖభోగ్యదాయి నం
దాపితపార్వతీశపద ♦ పద్మమనస్కవునై తికాని యుం
దీనవిధిమోక్షమొందగను ♦ నిద్ధియుఁ బూర్వఫలంబె మానినీ!

జగద్రక్షకుడగుసదాశివునకుఁ బాక్షికత్వమే లేదు. ఇదియొక యనాది
విధిని.

సీ॥ సాగర మంతలో ♦ స్థలమయంబుగఁ జేయు
ధర నంతలోనె సా ♦ గర మొనర్చు

అణువు లన్నియుఁ జేర్చి • యద్రిగా నొనరించు
మేరుపర్వతమును • మృత్తుఁ జేయు
తృణరేశమును వజ్ర • కణముగా నొనరించు
దివ్యవజ్రంబును • దృణ మొనర్చు
వహ్నికీలల శీత • వారిగ నొనరించు
హిమమున ననలంబు • నెనయఁ జేయు

తే॥ గీ॥ అట్టిలీలాస్వహావుఁడై • నట్టిప్రభుని
సర్వమంగళ సర్వజ్ఞు • సరణిఁ దెలియ
జలజనాభుడు బ్రహ్మయు • జాల రనిన
మానవుల దెంతవారలు • మాన్యచరిత! ॥

సుమ॥ తండ్రీ! పరమామృతవాక్యముల బోధించితివి. ఇంక నా జీవనమ్మమున గావలసిన దెద్దియు లేదు. ప్రాణదమగు పుత్త్రుఁడా మరణించెను. ఘోరతరవిషవ్రణములా శరీరమును బాధించుచున్నయవి. కావున మహాత్మా! ఆశ్రమముగ నీశరీరము బాయు నుపాయ మెఱింగించి పుణ్యముఁ గట్టుకొమ్ము.

ఋష॥ (నవ్వుచు) పిచ్చి కుదిరినదికాని పైత్యము తగ్గ లే దన్నట్లున్నది. వెఱ్ఱిదానా: పుత్త్రునిపై నాస విడువలేనిదానవు ప్రాణముల నెట్లు పీడఁగలవు. (స్వగతమున) ఈశిశువు తొలిజన్మమున గోవిందచరణారవిందమిళిందుఁడగు నజామిళుండు. పూర్వభవంబున మందరుఁ డను బ్రాహ్మణుండై జనించి పురాకృతకర్మవిశేషంబున వెండియు వేశ్యాలోలుఁడై యొకదినంబున మదీయసేవాభిరతుం డయ్యె. ఇపుడీజన్మమున నిట్లు రాకుమారుఁడై జన్మించె. కావున నితనిం బునర్జీవితుంజేసి రక్ష యొసంగెద. (ప్రకాశముగ) సుమతీ! ఎంత బోధించినను జింత వీడకున్నదానవు కానిమ్ము భవదభీష్టం బగుఁగాక. (అంగీనుంచి భస్మమును దీసి శిశువునకు రాచి శిరస్సుపైఁ జేయి నిడి ధ్యానించుచు) దేవా! మహాదేవా! మాం రక్ష। శిశుం రక్ష.

శా॥ నీవే సర్వజగన్నియామకుఁడవే ♦ నీ శాసనమ్మెల్లచో
నేవేళ న్వసియించుదేని యిపుడే ♦ యీబాలుఁ జిత్రంబుగా
జీవప్రాప్తు నొనర్చి భద్రసుఖదా ♦ శీర్వాదసంధాతవై
దేవా! కావవె భక్తరక్షణచణా! ♦ దీనావనా! శంకరా!

(శిశువు జీవించును. సుమతి యానందోద్రేకము నటియించుచు యోగిపాద
రజమును దీసి బాలునకు బొట్టు పెట్టును)

సుమ॥ మహాత్మా! ధన్యాస్మి! పరమేశ్వరాంశసంభూతులగు మీదర్శనంబు
నసే, నాపంత యడఁగినది. పుత్రభిక్ష నొసంగి నన్నుద్ధరించిన
దయామూర్తివి, కరుణామయా! తమ క్కైదైన సమర్పించుకొన
నోచని యగతికనప భవచ్చరణద్వందని క్షమింపుము.

ఋష॥ (నవ్వి) సాధ్వీ! ఏమియు వలదు. అంతయు నీశ్వరాజ్ఞ. ఎచ్చటి
నేజీవి కెట్టికష్టసుఖములు కలిగినను దైవఘటనయేకాని వేఱుకాదు.
ఇంక నీబాలు నతిజాగ్రత్తగఁ బెంచుచుండుము. మున్ముందు మీకు
శుభోదర్కము కాఁగలదు. పతిపదసేవాభాగ్యమును బడయఁగలవు.
(పద్మాకరునితో) పద్మాకరా! పరులని విరసింపక బరమాదరం
బున వీరలఁ గాపాడుచుండుము. నీభార్యయు నంతర్వత్నియై యు
న్నదికదా! అనతికాలంబుననే సునయుండగు తనయునిం బడయఁ
గలవు. వీర లిరువురు నేకోదరులట్లు మెలంగి దిగ్విజయం బొనర్చి
యశోధనులు కాఁగలరు.

పద్మా॥ [నమస్కరించి] మహాత్మా! నేఁడుదెంతం సుదినము. పరశివస్వ
రూపులగు తమరాకచే మేము ధన్యులమైతిమి. మీకృప మాకు
నిరంతర మగుఁగాక!

ఋష॥ పద్మాకరా! అట్లే యగుఁగాక! బాలుర నైదవయేట నుచితసంస్కా
రులఁ గావించి తగినగురువులకడఁ జదివించుచు, సమస్తవిద్యాపా
రంగతుల నొనర్పుము. ముఖ్యముగఁ జతురుఁడగు ధనురాచార్యుని

రాపించి యుద్ధవిశారదుల నొనర్పుము ఇంక మాకుఁ గాలాతిక్రమ
ణం బగుచున్నది. పోయివచ్చెద.

సుమ॥ దేవా! ఇంతదనుక తపస్సాన్నిధ్యముచే నాపదవాసి మహానందం
బున నెగడితి. మరలఁ బోము వెడలుద మనుచుండ నా కెదకేని
భీతి కలుగుచున్నది. కావునఁ దా మిటనే వసించి మా సపర్యలఁ
గైకొనుచు మమ్ముఁ గృతార్థులఁ జేయ వేడెద.

ఋష॥ సుమతీ! స్త్రీచాపలంబున నింత వచించుచుంటివి కాని మముబోంట్లు
కొక్కెడనే వసింపరాదు. అపుడపుడు వచ్చి మీసేమ మరయు
చుండెదను. సుగుణాకరుఁడగు పద్మాకరుఁడు మీ కేమియు గొఱం
తలేక కాపాడఁగలఁడు. నీకుమారుఁడు—

ఉ॥ శ్రీయుతుఁడై నిరంతర మ ♦ రిందము శంకరు నాత్మఁ గొల్చుచున్
శ్రేయము లగ్గలింప గుణ ♦ శీలియునై బుధమాన్యుఁడౌచు మే
ధాయుతుఁడై యశోధనని ♦ ధానసమంచితసుప్రవృత్తి భ
ద్రాయువుఁ గాంచి సౌఖ్యమున ♦ రాజిలు నావృత నెల్లకాలమున్.

సుమ॥ తండ్రీ! భవదాశీర్వాద మమోఘ మగుఁగాక! నాచిట్టికండ్రి మీకరుణ
వలన నంతటివాఁడైనచో నిరంతరము మీపదసేవచేఁ దరింపఁ
గలఁడు (కుమారుని ముద్దుగొని) కాని మహాత్మా! నిర్హేతుక
కరుణామయుఁడవై కుమారునిఁ బునర్జీవితు నొనర్చిన మీఋణము
ను! అవ్యాజానురాగంబున నగతికుల మగు మా కాశ్రయ మొసం
గిన యీపద్మాకరుని ఋణమును దీర్చుటయెట్లు? తలఁచినచో మాకిల
నెన్నిజన్మంబుల నెట్టియిడుమలఁగుడువవలయునో కదా!

ఋష॥ (నవ్వుచు) పిచ్చిదానా! అది నీసౌజన్యభావవిశేషము. [ స్వగత
మున ) ఆహా! పవిత్రసౌశీల్యమన నిట్టులకదా యుండవలయు!
(ప్రకాశముగ)

తే॥ గీ॥ ఒరుల కిమ్ముటయే కాని ♦ పరులయొద్ద
నెట్టిప్రత్యుపకృతిఁ గొన ♦ నట్టి యబల

వీ వగుట నిట్టులాడితి ♦ వింతెకాని
ఋణము నా దిది పరమేశ • కృపయె సుమ్మ॥

ఆ॥ ఇంక నేతడవు సేయరాదు. సంధ్యాకాల మతిక్రమింపఁగలదు.
పోయివచ్చెద.(నడచుచుండ సుమతీపద్మాకరులు నమస్కరింతురు.)

సుమ॥ పద్మా:—దేవా! సెలవు పునర్దర్శనమున ధన్యులఁజేయుఁడు

ఋష॥ నిరంతరశుభప్రాప్తి రస్తు—పుణ్యులారా! నిలువుఁడు

(ఋషభయోగి నిష్క్రమించును)

పద్మా॥ తల్లీ: ఇంకను సంశయమేల: దైవసముఁడగు ఋషభయోగి వాక్య
ములు మనకు శిరోధార్యములుసుమా! అమ్మా: లోనికేరమ్మా!

## తృతీయరంగము

(వైశ్యపురరాజవీధిని జంద్రశర్మ యనుబ్రాహ్మణుఁడు ప్రవేశము)

ప॥ శ॥ (దైన్యముతో స్వగతమున)

తే॥ గీ॥ చదివినాఁడను శాస్త్రముల్ ♦ సాంగముగను
నేర్చినాఁడ ధనుర్విద్య ♦ నిపుణముగను
ఆలుబిడ్డలఁ బోషింప ♦ నలవికాక
తిరుగుచున్నాఁడ దేశముల్ • దెలివు లేక॥

ఎన్ని దేశములు తిరిగినను నాపద్మఁ బరిగ్రహించి సుమ్మ పోషిం
పఁగలవారే లేరైరి. అబ్బబ్బా! "ఎరిగ్రమనకు సంతాన మెక్కు" డనుసా
మెత నాయందు సార్థకమైనది. "కలవున బిడ్డలు లేనివా రదృష్టవంతు"
లండు రిదియే కాఁబోలు. భాగ్యవశంబున భార్య యనుకూలవతికావున సరి
పోయినది. లేనిచో నాగతి యధోగతి కావలసినదే!—ఓహో! ఇదియేమి:
సతీసుతుల సత్రమున డించి రాజవీధి యోజనేయ నేమి ఫలంబగు. ఓజగ

ద్భంధూ! కృపాసింధూ! ఈపూటకీవీటఁ గడుపఁదగు నుపాయం బెద్దియైన గల్గింపఁజాలవా? (చింతించుచు నడచుచుండును)

(పద్మాకరుఁడు ప్రవేశించి గుమ్మమున నిలిచి)

పద్మా॥ అయ్యా! తమ రెవరు? ఏదియో చింతించుచున్న ట్లున్నారు?

చ॥ శ॥ అయ్యా! నేనొకపేదపాఱుఁడను. నాచరిత్ర మతివిచిత్రమైనది. వేయేల? (బూర్వోక్తపద్యమును జదువును)

పద్మా॥ (ముందునకు వచ్చి నమస్కరించి) అయ్యా! తా మట్టివారేయైనఁ దమ కేమిటను గొదువలేదు. సకుటుంబముగ మాయింటనే వసించి మాబాలురకు విద్యఁ గఱపుఁడు. మిమ్ముల సంతోషపరచుభారము నాయది.

చ॥ శ॥ [స్వగతమున] అమ్మయ్యా! ఎంతకాలమునకుఁ జల్లనిమాట వినఁ గలిగితిని! (ప్రకాశముగ) అయ్యా! చింతాతపంబున వాడువారిన మదీయజీవనలత భవద్వాగమృతధారలచే మరలఁ జిగిర్చినది. ఇంక నది పొలుపారఁ బుష్పించి పరిమళించుఁగాక. పరమేశ్వరుఁడు నీ కాయురారోగ్యభాగ్యంబు లొసంగుఁగాక. నీబాలకులు యశోధనులై దిగ్విజయులగుదురుగాక. ఏరీ! యాబాలుర నిటు రప్పింపుడు.

పద్మా॥ వాకిటనే నిలబడియుంటిరి. లోనికి దయసేయుడు. (తెరయెత్తగా బద్మాకరునిగృహము కనుపించును) ఆర్యా! అయ్యుచితాసన మలంకరింపుడు. (ప్రక్కకు జూచి) ఎవడురా? అక్కడ!

సేవ॥ [ప్రవేశించి] బాబయ్యా! ఏమిసెలవు?

పద్మా॥ నీవు తత్క్షణమే చిరంజీవుల నిటకు దీసికొని రమ్ము.

సేవ॥ చిత్తము! బాబయ్యా!

పద్మా॥ ఆర్యా! పద్మాకరు డనువైశ్యుడ. పరమేశ్వరానుగ్రహంబున భాగ్య భోగ్యముల కేమియుం గొదువలేదు. కాని యెంతకును సంతు కలు గదయ్యె. ఇట్లుండ నొకనా డొకరాజకాంత శిశువు నెత్తికొని దుః

ఘించుచు దారిని బోవుచుండ మాదాసి లోనికి బిలిచి నాకెఱింగించి
నది. నేనును వచ్చి యామె నేమ మారయుచుండగనే యాశువు
చనిపోయెను. అది గాంచి యాబిడ యెలుఁగెత్తి యేడువఁ దొడఁగి
నది. వీథివా రందఱు గుమిఁగూడిరి ఎన్ని చికిత్స లొనరించినను
ప్రయోజనము లేకపోయినది. ఇంతలో మాదాది యొకమహాయోగిని
వెంటబెట్టుకొని వచ్చినది. ఆమహానీయుఁడును మాప్రార్థన మాల
కించి యొకెంత మంత్రించి రక్ష యిడుటయు శిశువు సజీవుఁడై
యెల్లర కాశ్చర్యసంభ్రమంబులు గొలిపె ఆమహాత్ముని నామము
ఋషభయోగి ఆమహానీయుని యనుగ్రహంబుననే నాకును నొక
తనయుఁడు జనించె వారలిరువురే తమకుఁ గాబోవు శిష్యులు. విద్యా
భ్యాసార్హవయస్కులై యున్నవారల భవదీయశుశ్రూషావసరప్ర
దానముచే ధన్యులఁ జేయుడు. (పరిక్రమించి) అదుగో! చిరంజీ
వులను వచ్చుచున్నారు

(సేవకుఁడు బాలురఁ దీసికొని వచ్చును.)

పద్మా॥ నాయనలారా! వారుగో మీగురువుగారు. నమస్కరించి యాశీర్వా
దములఁ బొందుఁడు.

బాలకులు॥ (మోకరించి) గురుదేవా! నమస్కారము.

చ॥ శ॥ చిరంజీవులై, విద్యావినయసంపన్నులై, యశోధను లగుదురుగాక!
(పద్మాకరునితో) అయ్యా! వీరలనామధేయము లెయ్యవి?

పద్మా॥ గురువర్యా! ఈనాకుమారుని పేరు సునయుఁడు ఆరాకుమారుని పేరు
భద్రాయువు. ఈనాసుములును ఋషభయోగిప్రసాదితములే.

చ॥ శ॥ ఓహో! ఇదియంతయు ఋషభయోగీశ్వరుల మాహాత్మ్యమా!
ఆమహనీయుఁ డపరశివావతారము. ఆయనశుని వలన గాని దెయ్యా
దియు లేదు. సదా శివచరణలగ్నమానసుండగు సదానందమూర్తి.
అత్తపోధనున కాశీర్వాదపాత్రులగు యీచిఱుతలకు నేను విద్యా
గురుండ నగుటయు ధన్యతయే! (వ్రేళ్లలెక్కించి) పద్మాకరా!
వేయేల? ఈబాలు రుత్తమజాతకులు. ఈ రాకుమారుఁడు చతుస్స

మద్రముద్రితంబగు భూవలయంబున కధిపతియై యశశ్చంద్రికలఁ
జంద్రికశాభసన కాదరపాత్రుండగు. ఇంక నీవినయుఁడో! అత్రని
ఛాయవలె మెలంగి యంతటివాఁడగు. రేపటియము పదిగడియలకు
హస్తానక్షత్రయుక్త మీనలగ్నమున విద్యారంభ మొనరించెద.
లగ్నమున బృహస్పతి శుభయుతుఁడై యున్నవాఁడు. తక్కుంగల
గ్రహములన్నియు శుభస్థితి నలరారుచున్నయవి,

పద్మా॥ చిత్తము! నేటికి వలయు సంభారముల నంపెద. సుఖంబుగ భుజిం
పుఁడు. రేవతిశుభలగ్నముననే మీసుతు నిటఁ బ్రవేశింతురుగాక!

చ॥ శ॥ అట్లే యగుఁగాక! పోయివచ్చెద (నడచుచుండును)

పద్మా॥ బాలురు:— నమస్కారము! సెలవు!

చం॥ శ॥ అభీష్టావాప్తి రస్తు! మీ రింక నాగుఁడు. పోయివచ్చెద [నిష్క్ర
మించును.]

పద్మా॥ అయ్యలారా! మీభాగ్యవశంబున సద్గురువు లభించె పిన్నతనంపు
టాటల నుడిగి కాలమును వ్యర్థపుచ్చక, వినయవిధేయతలతో గురు
వును మెప్పించి వారికడ నున్నపద్యలన్నియు శీఘ్రకాలమున
గ్రహించి కృతార్థులు కండు.

భద్రా॥ అమ్మా! మీయాజ్ఞానుసార మట్లే మెలంగెదము. గురువు గా రను
గ్రహించినచో నతికాలముననే మీదయఁ బడయఁగలము

సుస॥ తండ్రీ! సుమతీదేవిదయవలన మే మిటుపురము కొంతవరకు విద్య
గడించితిమి. ధర్మసూక్ష్మముల నెఱింగితిమి. ఇంకను మిగిలిన
శాస్త్రపాండిత్యము లీమహాత్మునివలన నభ్యసించెదము.

పద్మా॥ చిరంజీవులారా! తేపటినుండి మీ కింక విశ్రాంతి లభింపదు. కావు
న నేడంతయు నాటపాటలతోఁ గాలక్షేప మొనర్పుఁడు.

బాలురు॥ హాయి! హాయి!

పద్మా॥ [పద్మాకరుఁడు బాలురఁ జూచి నవ్వుకొనుచు నిష్క్రమించును]

# భద్రాయువు

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

దుర్గానగర రాజప్రాసాద బాహ్యప్రదేశము - యుద్ధపటకుటీరమున మగధరాజగు హైమరథుఁడును, మంత్రి విక్రమసేనుఁడును ప్రవేశము.

హైమ॥ మంత్రివరా! ఈవజ్రబాహుఁడు మన మనుకొనినంత సులభముగ జయింపఁబడునని తోపదు. ఈయుదయమున యుద్ధక్షేత్రమునకు విలాసముగ నేగి చూచి వచ్చితిని. మనసైన్యము లప్రతిమాన శౌర్యమునఁ బోరాడుచున్నవి. శత్రుసైన్యములును పిఱుదివియక దలపడుచున్నయవి. సమర మతిసంకులముగ నున్నది. ఇంక వజ్రబాహుఁడే మూలబలముతో రణమునఁ జొచ్చెనా? మన సైనికు లాతని నోపఁజాలరు.

ఉ॥ అతఁడు మహాబలవంతు సమ ♦ రావళి నంకితనుఁగాంచె మోహనై
సతతము యుద్ధకౌశలవి ♦ శారదుఁడై యనవద్యవిక్రమో
ద్ధతి విజయాభిరాముఁడయి ♦ తా సమకూర్చెను రాజ్యమంత్రు యే
గతి నితనిన్ జయించెదము ♦ కానఁగరా దొకమార్గ మేవియున్.

ఇట్టి యీబలియుఁ డలతిగ నున్నవాఁడని బాలవాక్యముల విశ్వసించి కదనంబున కాయత్తుల మైతిమికదా:

విక్ర॥ (నవ్వుచు) ప్రభూ! ఏల యీయధైర్యము? ఇట్టియెడనా! పరపక్షాభినందనము? ఇంక వినుఁడు. నేనును నీయుదయమే మరల గూఢచారుల నంపి తెలిసికొంటిని. ఈ మధ్య లేకలేక వజ్రబాహుని

భార్య కొక్కకుమారుఁడు కలిగెనఁట. పుట్టినది సుత. సంతతము వ్రణబాధితుఁడై యేడ్చుచుండ సతీసుతుల ననాలోచితముగ నరణ్యములపా లొనర్చెనఁట. వలదనిన మంత్రి జయసేనకు నగరబహిష్కారము విధింపఁబడియె నఁట నూతనమంత్రి మంత్రాంగము చింతాభయుండగు రాజు నీంత పక్రమ మేపాటిది? మనకే తప్పక విజయము లభించును.

హైమ॥ (పిసుగుతో) తొందరసుండీయు మన కీగూఢచారులే యుపద్రవ కారకు లగుచున్నారు. అభూతకల్పనల నాధారించుకొని దుర్ఘటకార్యముల కుపక్రమించుట యసమంజసమని తోచుచున్నది.

విక్ర॥ దేవా! ఎన్నడు నెరుఁగని యిట్టి పిరికిమాటలు వలుకుచుంటిరేల? నా హృదయము విజయాశ సూచించుచున్నది. సుక్షత్రియవంశసంజాతులకు వలసినది ధర్మవిచారమా? క్షాత్రసమవలంబసమా?

తెరలో కొప్పకలకలము. హైమగుడవిక సేనాలోక్కసారిగ లేచి పక్కకుఁబోయి చూచెదరు.

విక్ర॥ ప్రభూ! చూచితిరా! మనపక్షమున విజయోత్సాహములు చెలరేగుచున్నవి! శత్రుసైన్యములు పలాయన మగుచున్నవి. అడుగో! మనప్రధానదండనాయఁ డీయెడకే తొందరగవచ్చుచున్నట్లున్నాఁడు:

హైమ॥ విక్రమసేనా! నీయట్టి సచివుఁడు దుర్లభుఁడు. నీధైర్యమపారము. నీవాక్యము లమోఘములు. నేఁడుగదా! నేధన్యుఁడ నైతిని! కాని! ఇట్టివిజయసమయమున నీదండనాథుఁ డిటు రా నేల?

విక్ర॥ దేవా! తొందరపడకుఁడు. అతనిరాకకుఁ గారణ ముండకపోదు.

సేనాని॥ (ప్రవేశించి) దేవా! జయము! జయము!

హైమ॥ దండనాథా! ఈకల్లోల మేమి? యుద్ధవార్త లేమి?

సేనాని॥ దేవా! ఎన్నియో యుద్ధములఁ జూచితిని, పోరాడితినిగాని యిట్టి యుద్ధ మెన్నఁడును గని విని యెఱుంగ. శత్రుసైన్యములు మిగు

లఁ బరాక్రమముగలయవి. మనసైన్యములు వానికి రెట్టింపుకావున సరిపోయినది. లేకున్న మన కపజయమే కలిగెడిది. అదియును గాక యీరాజు మిగుల పరాక్రమశాలి. మనయింతసైన్యముతో తా నొక్కరుఁడు స్వల్పకాలమును బురస్కరించుకొని యుద్ధ మొన ర్చుచున్నవాఁడు ప్రస్తుతము నారాక మెంచలకన, మనకు విజ యము తథ్యము. యింక నారా జొకగడియలో జయింపఁబడ గలఁడు కాన రాజును బ్రాణములతోఁ గొనిరమ్మందురో! లేకున్నఁ జంపి వేయమందురో! తమయాన నెఱుంగ వచ్చితిని.

హైమ॥ ఔను! మంచివిషయమునే కొనివచ్చితివి. సాధ్యమైనంతవఱ కా తనిఁ బ్రాణములతోఁ గొనివచ్చుటయే మంచిది. అతనితోఁ గొంత సంభాషణ నా కవసరము. కాని! మనబలము లేమైన నష్టపడినవా?

సేనా॥ ప్రభూ! సైన్యనష్టమును, రక్తప్రవాహమునుఁగాక రాజ్యము లూఱక లభించునా?

హైమ॥ సరియే! నీవు శీఘ్రముగ నేగి రాజును బట్టి బంధించి కొనిరమ్ము! అతఁడు కడుమాయావి. జాగ్రత్త!

(సేనాని నిష్క్రమించును)

విక్రి॥ దేవా! మన కాపీడయేల? శత్రుశేష ముండఁదగదుకదా?

హైమ॥ ఆ! రెక్క లూడినపక్షి. అతనివల్ల మన కే మగును? రానిమ్ము! చూతము. శత్రువులఁ జంపుటకన్న చెరఁబెట్టుటయే యుచితము.

(మరల యథోచితముగ నాసీను లగుదురు.)

హైమ॥ ఆహా! ఇప్పటికిఁగదా! మనరాజ్యము నిష్కంటకమైనది.

విక్ర॥ ప్రభూ! అట్లనరాదు. ఏమో! ఏనాటి కేమి యగునో యెవరు చెప్ప గలరు? కాల మొకతీరున నుండునా?

హైమ॥ పిచ్చివాఁడా! ఇంకను భయమేల? నిరంకుశముగ దశార్ణదేశమును దదధిపతియు మనచేఁ జిక్కినవి. ఇంకఁ బరిసరరాజవర్గమంతయు మనకు లోఁబడినవారేకదా?

విక్రి॥ మహారాజా! నాకట్లు తోచుటలేదు, భవితవ్యము మన మెఱుంగఁ జాలముకదా! (ప్రక్కకుఁ జూచి) ప్రభూ! అడుగో! దండనాథుఁడు. వజ్రబాహుని బంధించు కొనివచ్చుచున్నాఁడు.

హైమ॥ (ఆవైపునకే గంభీరముగఁ జూచుచుండును)

( సేనానియు బంధింపఁబడిన వజ్రబాహుఁడు, భటులు ప్రవేశింతురు .)

హైమ॥ ఓహో! వజ్రబాహుమహారాజులా! వీరశిరోమణు లిట్లు పాశబద్ధులై తల వంచితిరేల? అవమానము దుర్భరముగ నున్నదా?

వజ్ర॥ (రోషముతో) ఓరీ! దుర్మతీ! ఈనాటికి మీకుఁ గాళ్ళువచ్చినవా? విచారభరంబునఁ బరిపాలనానిర్వహణం బేమరియున్న యవనుఁ గని వృద్ధుఁడనైన నన్ను జయించినందులకే ఇంతగర్వమా? నీపితృపితామహుల కేరికిని దేరిచూడరాక యిందనుక సురక్షితమై యున్న యీదశార్ణరాజ్యలక్ష్మి నేఁడు నీపాలఁ బడవలసియున్న దికాఁబోలు.

హైమ॥ ఓయీ! నీవు జయించిన రాజ్యములన్నియు నిట్టి పరిస్థితిలోనివే కావా? బలగర్వంబునఁ గన్నుఁ గానక మాబోటివారల నెందరినో నీ విట్లు పరిభవించి యుండలేదా? ఆపాపఫల మంతయు ననుభవించెదవు లెమ్ము

వజ్రి॥ తులువా! పాపుఁడవు నీవో నేనో నిర్ణయించునది మనము కాదు. ధర్మసభామధ్యమున నీచాపల్యములు విశదపరచినఁ దేలఁగలదు. అది యటుండఁగాక. పాఱుఁబోతా! నేఁటి కెంతటివాఁడవైతివిరా?

తే॥ గీ॥ శత్రురాజుల నిర్జించి ♦ శరణటన్న
నిన్నుఁ బోలినవారల ♦ నెమ్మిఁ గాచి
విక్రమంబునఁ జరియించు ♦ వేళలందు
ఎచట దాగితి వోయి! నేఁ ♦ డిట్లు పలుక.

హైమ॥ ఓయీ! నీ విపుడు మాకైదీవి! నానీ దేశపురాజును! తెలిసినదా!

విక్రి॥ ప్రభూ! నడుము విరిగిన సర్పము. ఊరక ప్రేలాపింపనేల?

హైమ॥ సేనాపతీ! నీ పీతని గొనిపోయి కారాగారమున బంధింపుము. మరియు నంతఃపురమున్నకు మదీయాగమనం బెఱింగింపుము. ధనాగారములన్నియు వశపఱచుకొని మనముద్రలు వేయుము, మనపరిపాలనకు లోఁబడని ప్రజలను, నుద్యోగులను నూఱు వెడలింపుము. పొమ్ము!

(అందఱు క్రమముగ నిష్క్రమింతురు)

(తెరవ్రాలును)

## ద్వితీయరంగము

(పద్మాకరుని గృహము - ఉచితాసనమునఁ జంద్రశర్మయు, భిక్షార్థియును వరుసలు చెరియొకవైపున నిలఁబడియుఁ బ్రకాశింతురు.)

చ॥ శ॥ కుమారులారా! ఇంక మీకు విద్యాపరిసమాప్తియైనది. మాప్రయాణమునకు నేఁడే శుభదినము. కావునఁ బోయివచ్చెదము.

ఉ॥ వచ్చితి నాలుబిడ్డలతో • బంధుల వీడి దరిద్రబాధచేఁ
జొచ్చితి నీపురంబు కడు • శోభ వెలింగితి నీగృహంబునన్
మెచ్చితి మీసపర్యలను • మేలొనఁ గూడెడు మీకు నింక నా
కెచ్చట భక్తియో యచటి • కేగెద గావున వీడు కొల్పుఁడీ.

పద్మ॥ గురుదేవా! మీదయావిశేషమున సమస్తవిద్యల నెఱింగితిమి అజ్ఞులమగు మమ్ము విజ్ఞులఁగా నొనర్చిన మీఋణముఁ దీర్చుకొనఁ జాలము. తా మెచ్చటనున్నను మాకు మీశుభాశీర్వాదములు లభించుఁగాక. మిము సన్మానింప మా తండ్రిగారు యత్నించుచుండిరి. ఏలనో తడవుచేసిరి. [ప్రక్కకుఁ జూచును]

భిక్షా॥ మహాత్మా! భవదుదారకరుణావశంబున ధన్యుఁడనైతి. పోషకుఁడగు పద్మాకరునకే శరీర మొసంగితి. ఇంక నాజీవములు భవదధీన

ములు. కాని! దయామయా! ఇంకను గొంతికాలము మీసేవ నొన
ర్పవలెనని యున్నది. తా మెచ్చటికో యరుగ నేల? యచ్చటనే
యుండి మా—

చ॥ శ॥ రాకుమారా! అట్లుకాదు నేనేర్చినవిద్య మీకు సాంగముగ నొసం
గితి. ఇంక నావలన మీకుఁ రావగిన దేదియు లేదు. ఇంకను వ్యర్థ
ముగ మీయుప్పుపులుసుం దిని మీఋణమునఁ బడియుండ నొల్ల.
అపుడపుడు వచ్చి మీసేమ మరయుచుండెదను. నాచెప్పినచొప్పున
న్యాయధర్మనిర్వాహకులై నాకు సద్యశ మాపాదింతురుగాక! మీ
రిఱువురు నెన్నఁడైన తగవులాడుకొంటిరేని నాయాన.

( పద్మాకరుఁడు, బహుమానములతో సేవకుఁడు ప్రవేశము. )

పద్మా॥ గురూత్తమా: నామనవి నించుకయు సరకుగొనక నేఁడే పయనిం
చుచుంటిరి. ఇంకను గొన్నిదినంబులుంట మాయభీష్టము.

చ॥ శ॥ గుణనిధీ! నీయట్టిసదభిమాను లీదేశమున నఱుదు. సుగుణాకరుండ
వగు నీభక్తి కొనియాడఁ దగినది. కాని యిప్పట్టున నాపయనమున
కడ్డురాకుము. నాయభిమత మెఱుంగుదువుకదా?

పద్మా॥ ఇంక మీదయ కుమారులారా! ఈబహుమానములను మీగురువ
ర్యుల కొసంగి నమస్కరింపుఁడు. ఆశీర్వాదములఁ బొందుఁడు.

భద్రా॥ సున:– (బహుమానముల నందికొని గురువున కిచ్చి నమస్క
రింతురు.)

చ॥ శ॥ [బహుమానముల నందికొని] శిష్యోత్తములారా! చిరంజీవులై
యశోవిరాజితు లగుదురుగాక. మాతాపితృసేవాపరాయణులై గురు
దేవానుగ్రహపాత్రులై దుష్టశిక్షణశిష్టరక్షణతత్పరమానసులై సర్వ
జనసంస్తుత్యచరిత్రు లగుదురుగాక. ఇంక నే నాలసింపరాదు. సుల
గ్నము కడచనఁగలదు. పోయివచ్చెద. (నిష్క్రమించును.)

పద్మా॥ కుమారులారా! మీనేర్చిన విద్యలన్నియు మఋషభచింతన మొనర్చి కొనుచు, కీర్తిని గడించుకొనుచు సంతసమునఁ గాలముఁబుచ్చుఁడు.
(తెరలో ఋషభయోగిస్తుతి పరమశ్వరగానము)
పద్మా॥ (ఆలకించి) అయ్యలారా! మహానుభావులు. ఋషభయోగీశ్వరులు వచ్చుచున్నారు! ఎదురేగి తోడితేవలయు రండు.

(అందరు నిష్క్రమింతురు)

## తృతీయరంగము

(పద్మాకరుని గృహాంతర్భాగము - ఋషభయోగి, సుమతీభద్రాయువులు యథోచితముగఁ గూర్చుండుదురు. తెర యెత్తఁబడును)

సుమ॥ తండ్రీ! నీవనినది సత్యమే. కాని యెన్నిదినంబు లిట్లు పరులపంచను జీవించుట ? దయాకరుండగు పద్మాకరునిఋణ మెన్నటికిఁ దీర్పఁ జాలము. ఇంకను నాయనఘునిసొమ్ముఁ దినుచుఁ గూర్చుండుట యభిలషణీయమా ?
భద్రా॥ (తీవ్రముగ లేచుచు) దేవా! పరాభవానల సంతప్తచిత్తయగు యీ నాజననికన్నిరింకఁ గాంచజాల. దుర్మతులగు సపతీవల్లాల శిక్షింపక విడువఁజాల కావున నే నిపుడే పోయి దూరదృష్టిలేని నాతండ్రిని మందలించి నిజము వెల్లడించి నాతల్లికి సుఖముఁ గూర్చెద. సెల వీయుఁడు (లేచి నమస్కరించును)
సుమ॥ (కుమారునిచేయిఁ బట్టుకొని) నాయనా! వలదు. తాతగారియనుజ్ఞ యైనఁగాని వలనుపడదు. కూర్చుండుము (కూర్చుండఁ బెట్టును)
ఋష॥ [నవ్వుచు] పిచ్చివాఁడా! ఏమి యీయవివేకము? సమస్తశాస్త్రములఁ జదివిన ఫలిత మిదియా? ఎంత క్షత్రియోత్తముఁడవైనను శమదమంబు లవలంబనీయములుసుమా. నిన్నును నీతల్లిని బాధిం

చెననునెపంబున పైపసముఁకను గండిగ్రిని బలానపిఁను నెంతుపా
తీవ్రిత యెన్నఁడును బసికిరావు.

ఉ॥ కోరిన వచ్చునే సుఖము • కోరక కష్టము రాక మానునే
కారణమౌను పూర్వభవ • కర్మఫలంబు జీవ కోటికిన్
ధారుణి నష్టసౌఖ్యములఁ • బద్దయు గూర్చెడు నంతెకాని తా
గోరిన కోర్కెలెల్ల నమ • కూరిన నాకముగాదె భూమియున్.

అదియునుఁగాక సమస్తపురాణసారిమును సంగ్రహముగా చెప్పెద. శ్రద్ధానుఁడవై యాలకింపుము.

సీ॥ దైవంబు గురువును • దల్లియుఁ దండ్రియుఁ
బూజనీయులు సదా • పుణ్యచరిత
గో విప్ర శిశు సతి • గురుతుల్యులనయంబు
సంరక్షణీయులు • జగతి నెపుడు
శమదమనియతియు • సత్యశౌచంబులు
ఆచరణీయము • లనవరతము
క్రోధంబు మోహము • లోభమాత్సర్యముల్
వర్జనీయంబు ల • పాయములును

తే॥గీ॥ దానధర్మంబు లిహపర • మైన సుఖము
లొసఁగ పరమేశుసత్కృప • నెసఁగఁ జేయు
సర్వశాస్త్రార్థసంగ్రహ • సారమిదియె
ఆచరింపుము శుభమగు • నప్పు! యెపుడు

మఱియును విధివిహితకులాచారధర్మంబు లనవరతము గావింపుము. నీవు సుక్షత్రియవంశసంజాతుఁడవు. దుష్టశిక్షణ శిష్టరక్షణంబులు క్షత్రియ ధర్మంబులు. కాన జైత్రమున, సదా విజయము లభించునట్లును, పాపపరిహార మగునట్లును మంత్రరాజం బొండుపదేశించెద. విశ్చలుఁడవుకమ్ము.

భద్రా॥ చిత్తము! సావధానుఁడనైతిని (నమస్కరించును)

(బుషభయోగి భద్రాయువు చెవిలో మంత్రముపదేశించును)

చంద్ర॥ (కండ్లు మూసికొని గ్రహించుచుండును) మహాత్మా! ధన్యోస్మి! వత్సా! ఇయ్యది శివకవచంబు నాఁబడు. సర్వబాధానివృత్తికరంబును, సర్వరక్షకరంబును. పరశివాత్మకంబునగు నీమంత్రము సర్వబాధలను తొలఁగించును. ఈ మంత్రసిద్ధివలన ద్వాదశసహస్రమదగజబలుండవై దుర్నిరీక్ష్యతేజశ్శాలివై మృత్యుంజయానుగ్రహంబున శత్రుజయుండవై భాసిల్లెదవుగాక: (అంగీనుండి యొకశంఖము ఖడ్గముఁ దీసి) వత్సా: శత్రుసమ్మోహనసంహారకకరంబులగు వీనిని గ్రహింపుము. (ఇచ్చును)

భద్రా॥ (గ్రహించి) దేవా: నిర్హేతుకకృపానముద్రులరగు మీ ఋణమెట్లు తీర్చుకొందును?

చం॥ తనువును జీవసంచయము • దాన మొనర్చితి నాదుపోషకుండనఘుఁడు వైశ్యవర్యునకు • నట్టిగురుండగు చంద్రశర్మకున్ గన నీక నొక్కయాత్మ కల • కాలము మీకు సమర్పణంబుగా నొసఁగెదనాఁడ మీఋణ మి • దేగొనుఁడయ్య: మునీశపుంగవా:

(మోకరించి నమస్కరించును)

సు॥ కుమారా: ఈమహాత్ముని ఋణము జన్మజన్మాంతరములనైనఁ దీర్పఁగలమా? ప్రత్యక్షదైవమువోలె నిచ్చటికి వచ్చి యున్న రక్షించెను. దేవా! ఋషభయోగీంద్రా! నీపాదములు యుగయుగాంతరములఁ బూజనీయమ్మై, దేవమానవగంధర్వాదులకు రక్షకములగుఁగాక:

ఋష॥ అమ్మా! మహాపతివ్రతవగు నీవాక్యము యథార్థమై యుండు. అచిరకాలంబుననే మీరు శుభంబు లందఁగలరు. పరమేశ్వరధ్యానానందతన్మయుఁడనై నిలువుఁడు.

(ఋషభయోగి శివసంకీర్తనముతో నిష్క్రమించును తల్లికుమారులు దన్మయులై

తాళము వైచుచు నావంకకే చూచుచుందురు.)

సుమ॥ (కండ్లుతెరచి) నాయనా! ఇంకరమ్ము. నేఁడు సుదినము అచిరకాలమునకే నీవు యువరాజవు కాగలవట లెమ్ము. గురుదేవుల యాశీర్వాద మూరకపోవునా?

భద్రా॥ (నవ్వుచు) తల్లీ! స్త్రీచాపల్య మింతటిదేకదా! దుఃఖము కలిగినను సంతసము చేకూరినను కడు తీవ్రించుచుందురు.

సుమ॥ తండ్రీ! సంతసము సర్వజీవనసముత్సాహకరము గాదా? రమ్ము! పోదము

(ఇరువురు నిష్క్రమింతురు.)

## చతుర్థరంగము.

(వైశ్యపురపరిసరప్రదేశమున, భద్రాయుసునయులు ప్రవేశము.)

భద్రా॥ సోదరా! చూచితివా! వాహ్యాళి యెంతసుఖప్రదముగ నున్నదో! మనమింతదనుక గురుకులవాసముచే విద్యార్జనవశంబున నన్యమెఱుంగకుంటిమి. ఈశీతలమందసమీరములు పథశ్రమ వాపుచున్నయవి. ఉష్ణాంశుఁడు సుధాంశుఁడై నయనానంద మొదవించుచున్నవాఁడు ఆహా! ప్రకృతి యెంతమనోహరముగ నున్నది! ఈశ్వరవిలాసము మహాద్భుతముగదా.

ఉ॥ చల్లనిపిల్లతెమ్మెరలు ♦ చారుహరిత్తృణశాద్వలంబులున్
బల్లవబాలకూటములు ♦ పచ్చిక మేసెడుగోగణంబులున్
గొల్లగఁ బూచువృక్షములుఁ ♦ కోయిలకూతలు బాటసారులున్
వెల్లము సేయు నీప్రకృతిఁ ♦ దృశ్యమహాద్భుతనైజసంపదల్.

సున॥ అన్నా! ఇది యొక్కఁడే యననేల? సృష్టియే యీశ్వరవిలాసముగదా. ఆమృతమయాంతఃకరణమున కానందానుభూతి నొదవింపనిదేది? ప్రకృతియే పరమాద్భుతము, మానవజీవితమే మహాద్భుతము.

హింసించుచుండిరి. ధనధాన్యములనన్నియుఁ గొల్లగొట్టిరి. [illegible]
దుల జెఱఁబెట్టిరి. [illegible] మే మెటులో
తప్పించుకొని ఈదారినిఁ బడితిమి [illegible]
వలయునో! అయ్యా! ఈదారి యేయూరికి పోవునో?

భద్రా॥ మహానుభావా! విచారింపకుఁడు. మే మిపుడే మాజనకునియనుజ్ఞఁ
గైకొని దశార్ణమునకేగి యామగధుల దుర్మదము నడఁచెదము.
పురమున [illegible] చేయుచుండగా, అం
తదనుక మీరీపురమ్మునందే వసించుఁడు. మీ కేమిటను గొఱంత కలు
గనీయము. భయమును వీడుఁడు. [సునయుని జూచి] సోదరా!
నీయభిమత మేమి?

సున॥ అన్నా! ఆర్తత్రాణపరాయణత్వ మనన్యకరణీయమేకాని, కేవలధను
ర్మాత్రసహాయులమై, విజయగర్వాంధుల [illegible] మాగ
ధుల జయింపఁగలమా?— అని నాసందియము.

భద్రా॥ సోదరా! సాధ్యాసాధ్యముల విమర్శింపఁ బనిలేదు. మానవబలము
వారికున్న మనకు దైవబల మనుకూలించుఁగాక. [illegible]
శస్త్రాస్త్ర సంపన్నులము. పోవునది ధర్మసంరక్షణార్థము; దైవ
మేల యనుకూలింపకుండును?

సున॥ అన్నా! మన మెంతటివీరులమైనను నెంతటి శస్త్రాస్త్ర[illegible]
రథగజతురగపదాతులతో [illegible] జయిం
చుట యన మాటలతో నగునదియా?

భద్రా॥ సునయా! భీరువువలె వచించుచుంటివేల? [illegible]
వమాత్రమునందే పరిపంథిసైన్యము గుండె [illegible]
నొనర్చి కృతకృత్యులముగాగలము. సందియ ముంచకుము. (జను
లతో ) అయ్యా! పోవుదము రండు.

(అందరు నిష్క్రమింతురు)

# భద్రాయువు

## చతుర్థాంకము.

### ప్రథమరంగము.

( కృష్ణానదీతీరసమీపమున యుద్ధక్షేత్రము. సునయభద్రాయువులు ధనుర్బాణఖడ్గధారులై ప్రవేశింతురు )

సున॥ అన్నా! చూచితివా! నే ననినట్లే యైనది, మాగధులు దుర్బలులుకారు. తొమ్మిదక్షౌహిణుల సైన్యమట. అందఱు నారితేరినబంటులు. దైవ బలమును నమ్మి మన మీవ్యవసాయమునకుఁ గడంగితిమి. రక్తబీజసంతానమువలె నగుపడుచున్న యీసేనావాహినిని జయించుట దుస్సాధ్యమని తోఁచుచున్నది.

భద్రా॥ సునయా! పిరికిమందు వోయకుము. అక్షౌహిణులేమి, అర్బుద పరంపరలు చుట్టివచ్చినను భద్రాయువు భిన్నమానసుఁడగునా? పిచ్చి నాయనా! దైవబలమే బలముకాని, మానవబల మేపాటిది.

తే॥గీ॥ అస్త్రగురు చంద్రశర్మను ♦ నభినుతించి
ఋషభయోగీశపదసక్త ♦ హృదయుఁడనయి
శివకవచమంత్రరాజమునుఁ ♦ జేయుచుండి
విజయలక్ష్మిని గైకొందు ♦ వేగముగను.

ఆదిగాక మన మిట్లు పాదచారులమై యెంతతడవు యుద్ధమొనర్తుము. కావున ముందుగా నొకరథికుని సంహరించి రథరథ్యముల సంపాదించితిమా, సుకరముగ నీశమస్తసైన్యమును జయింపఁగలము.

సుశ॥ ఆ! ఇది మంచియుపాయమే! కాని యీకోలాహలమున నది యెట్లు సాధ్యపడును?

భద్రా॥ ఇది [illegible] అదిగో! ఆవైపునఁ బొదలచే నిండి సన్నని మార్గ మొకటి కానవచ్చుచున్నది. సుశ! నీవావంకకేగిన నన్నియుఁ జక్కఁబడును. వ్యూహము నన్ని విచ్ఛిలముగా నున్న యీసైన్యమును గలంచెద చూడుము —ఓరోరీ! మాగధకిరాతులారా! ఊరక యట్లు చూచెదరేల? భయము కలిగినచోఁ బారి పొండు. లేదా యిటువచ్చి మమ్మెదిరింపుఁడు.

శా॥ ఓరీ! దుర్మతులార! రండికను నీ • యుద్ధంబు మీమృత్యువై
యీరీతిన్ మిము గట్టితెచ్చె నిటకున్ • మేలా వృథాలాపముల్
క్రూరాత్ముం డగు మీప్రభుం డెచట? సం • కోచింపకన్ దెల్పుడీ
ఘోరాజిన్ బరిమార్తు వానిని వెసన్ లో • కుల్ మెచ్చి భూషింపగా.

(తెరలోఁ గలకలము. బాలకులారా! నిలువుఁడు. నిలువుఁడు. అనునేకులు)

సున॥ అన్నా! చక్కనియుపాయఁ బన్నితివి, వారలకు రోషముఁ గలిగించి కదిపితివి. అదిగో! తండతండములుగ వచ్చుచున్నారు. మనమును నీచెప్పినమార్గమునకుఁ బోయి సన్నద్ధుల మగుదము.

భద్రా॥ [బిగ్గరగా] ఆ! రండు! వెనుఁదిరిగి మీప్రభువున కపయశ మాపాదింపకుఁడు. భారతభూమి ధర్మవీరనిలయ మనుమాట మఱువక పరాక్రమోపేతులై నిలువుఁడు. సోదరా! పోదముపద!

( ఇరువురు నిష్క్రమింతురు. తెరవ్రాలును.)

## ద్వితీయరంగము

(యుద్ధక్షేత్రమున భద్రియువు కాద్రముతోఁ బ్రవేశించుచు)

శా॥ ఓరీ! మాగధ! కర్మబాంధ తులువా! ♦ యుద్ధావనిన్ వీడితో
నారీవేషముఁ బూని రాణులతొ నె ♦ న్నన్ గూడితో పాఱితో
కూర్రా! యెచ్చటికేగినన్ విడువ సం ♦ కోచంబు నీకేల రా
ధీరా! క్షత్రియజాతిఁబుట్టి తగునే ♦ భీతిల్లఁగా మూఢుఁడా.

హైమ॥ (కోపముతోఁ బ్రవేశించి) ఓరీ! వాచాలా! ఏమంటివి?

ఉ॥ మాగధరాజులన్న కడు ♦ మాన్యులు, ధీరులు, గాని మీవలెన్
దొంగలు, నీచవర్తనులు, గారు♦ దురాత్మ! బాలురన్
మూగి వధించు టొప్పదని! ♦ మెగ్గరమున్ విడి పోరిసందుకా
యీగతిఁ ద్రేలుచుంటివిర ♦ యెవ్వఁడ వీవు వచింపు మింతకున్.

భద్రా॥ ఓయీ! హైమమరథా! పాపమువలెఁ గూడిననీసైన్య మంతయు నశించినది. మిగిలినవారిపని మాసునయుఁడు చూడఁగలఁడు. ఇఁక నీవు నావంతు. ఏదీ! నీబలపరాక్రమము లెట్టివో చూతము రమ్మి.

హైమ॥ (నవ్వుచు) సరికాని మాణవకా! మీ రెవ్వరో తొలుతఁజెప్పవైతివి?

భద్రా॥ [వికటహాస్యముతో] ఓహో, మాగధా! ఇదియేమి? సంధి యేమైనఁగావలయునా? లేక వియ్య మందెదవా? మన మిటఁ జేరినది కయ్యమునకుసుమా! నేను— నీశత్రువర్గములోనివాఁడనే. ఇంకను విశదముగ వలయునన్న మాచెఱసాలలో నొకానొకప్పుడు నీకు విశదపఱతును లెమ్మి.

హైమ॥ ఓరీ! చెడుగా! యూరుపేరులులేక యెచ్చటనో మాయమంత్రముల నేర్చి, యేమరపాటునున్న సైనికుల జయించితిమని యుబ్బి తబ్బిబ్బులై కన్నుఁగానక యవాచ్యము లాడుచుంటివా? పిన్నపెద్ద లను తారతమ్యము విచారింపవలదా?

మ॥ అలనా దుర్ధతి వజ్రబాహు నవిలో • నవ్యాహతిన్ గెల్చి నే
నలఁ బెక్కెంటిని దిక్కుమార్చి విజయా • నందంబు దీపింపగా
లలి సింహాసనరత్నపీఠముల నే • రాజల్లు కాలంబునన్
దుబవా! యేయెడ కేగినాడవురనీ • దోర్వీర్య మేమాయెరా.

భద్రా॥ అ! అదియే, నేను చెప్పఁబోవునది. పిన్న పెద్దలతారకమ్ము లెఱుంగియేనా? వృద్ధుఁడగు వజ్రబాహునిఁ దూలనాడితివట.

శా॥ ఆనాఁ డెట్టుల నీవు వృద్ధునటు న • న్యాయంపు యుద్ధంబునన్
హీనాత్యంతనృశంసబుద్ధి వసుమన్ • హింసించినావో యటుల్
దీనారాతివి మానవాధమ నినున్ • దీవ్రాసి యుద్ధంబునన్
యీనా డీరణరంగమందు నిపుడే • హింసింతునా మర్మతిః
నేటికి నీపాపము పండినది. దేనికైనాని సమయ మాసన్నముగా వలదా?

హైమ॥ ఛీ! వలుగాకీ! ఉపేక్షించినకొలంది నింతగా వదరుచుంటివా?

ఆ॥ వె॥ పిన్నవాఁడవనుచుఁ • బ్రేమించి యుంటగఁ
జనువొసంగినాఁడ • చెనటి నీకు
మదగజంబునంచి • మతిలేని శునకంబు
మొఱుగుచెపిఘముఁగాగ • నజమె పేల?

భద్రా॥ ఓయీ! మాటిమాటికిఁ బిన్నపెద్దలని వాకొనుచుంటివి? పెద్దయన నెవఁడు?

తే॥ గీ॥ కులము వంశంబు విజ్ఞత • వెలయువాఁడు
పరులకష్టసుఖంబుల • నరయువాఁడు
శాంతశమదమ సత్యశౌ • చములు గల్గి
వినయము గలాఁడు పెద్ద యౌ • ననఁగ నొప్పు.

హైమ॥ ఓరీ! బాలుఁడవైనను జాలనేర్చితివి. ఇట్టిధర్మోపన్యాసములు మేము ను నెఱుంగుదుము కాని-డింభకా! నిన్నుఁగాంచిన నామనంబున

నేఁడో జారి కలుగుచున్నయది. ఏల నీ కీయాలము? వలయు
నన్ను నపారమనుభవం బొసంగెను. తృప్తినొంది మరలిపొమ్ము.

భవా॥ ఛీ! ఛీ! దుష్టుఁడా! లంచములిచ్చి రాజ్యము లార్జించుచుంటివా? సుక్ష
త్రియవంశసంజాతునకు వలసినది క్షాత్రముకాని ధనము కాదు.
బలపరాక్రమశాలివని దెగఁ బొగడుకొనుచుంటివే? ఇదియేనా
నీమగటిమి? కత్తిదూసి కదనమునకు రమ్ము.

హైమ॥ ఓరీ! నీ కాయువు మూడినది. లేకున్న నీ వేమమారవు యింతగా
పలికెదవు. గాదని తిరస్కరించెదవా? నిన్నింక క్షమింపరాదు.
[కత్తిదూసి] వచ్చితి పిండిగాఁ జేసికొనుము (కత్తినెత్తును.)

భవా॥ (కత్తిదూసి యెదుర్కొని) పాపాత్మా! భవాన్మశివానుకిని దయనీము
క్తమై వసుంధర పావని యగుగాక!

(యిరువురు కత్తియుద్ధ మొనర్చుచు లోని కేఁగుదురు.)

(తెరవ్రాలును)

## తృతీయరంగము

(వంశీభూషణుఁడు సింహాసనమున, ఇరువైపుల సభాసదులును మంత్రి, సేనాపతి, ప్రజలు యథోచితస్థానములను యుండఁ దెర యెత్తఁబడును.)

మంత్రి॥ పౌరులారా! దుర్మార్గుఁడగు మాగధునికారణమున మనమందఱు
మనేకకష్టము లనుభవించితిమి నేఁ డీమహాపుణ్యకాలమున
మనయిక్కట్టు లడంగినవి. పిన్నవారలయ్యు నజయ్యులైన మా
గధబలంబు లడంచి దురాత్ముఁడగు హైమరథునిఁ బెరఁబెట్టిరి.
చూడఁజూడ వీరలు మదీయభాగ్యదేవతలవోలెఁ గన్పట్టుచుండిరి.
ఇట్టి యీశుభసమయంబున నీమహనీయుల సన్మానించుట యుచి

తమని నాతలంపు. ( భద్రాయు సునయులతో) కుమారులారా! మీ రు వయసున నాకన్న పిన్నవారలగుట మిమ్ముల నే నెక్కుడుగా బొగడ దగదు పెద్దలచే బొగడఁబడుట దోసమని బుధులందురు ప్రత్యుపకృతి యొనర్చుట నాకు ధర్మము. కావున ( తలలోనుండి యొకమణిఁదీసి) కుమారా! ఈయది శిరోభూషణము నాఁబడు నమూల్యరత్నము. మదీయపితృపితామహులనాఁటిది. దీనిధరించు మానవులు-

తే॥ గీ॥ ముదిమి, రుజయును, ఖేదంబు • మొదలుగాగ
బాధ లెవ్వియు నొందక • భర్గుకరుణ
ఆయురారోగ్యభాగ్యంబు • లందఁగలరు
భక్తిధరియింపుమీఁక దీని • భద్రతేజ!

(రత్నమును భద్రాయువున కొసంగును)

భద్రా॥ (తీసికొని కండ్లకద్దికొని శిరంబున దరించుచు ) మహాప్రసాదము అమృతోపమానములగు మీ వాక్కులే మాకు మిమ్ము స్నేహపా త్రులుగ నొనర్చుచుండ, మఱల మీయమూల్యరత్నప్రదానమున చిరబద్ధు నొనర్చితిరి

వజ్ర॥ నాయనా! దానికేమికాని, ఈమాత్రపు బ్రత్యుపకృతిఁ గొని మమ్ము ధన్యుల నొనర్చితి వంతియచాలు కాని—వీరకుమారా! అడుగమర చితివి. ప్రాణదాతలగు మీకులగోత్రనామంబు లెఱింగింప రైతిరి. ఏదీ ! శ్రవణానందముగ వినుపింపుడు ?

భద్రా॥ [ సునయునకు కనుసైగఁ జేయును.]

సున॥ మహారాజా! ఈయనఘుఁడు భద్రాయువను నొకరాకుమారుఁడు. నేను సునయుండను వైశ్యపుత్రుండను తల్లితోఁగూడ నీమహాత్ముఁడు చాలకాలమునుండి మాయింటనే వసించుచుండెను. మే మిరువుర మేకోదరులట్లు మెలంగుచు, గురుకృపాపాత్రులమై, యశేష

విద్యాపారంగతుల మైతిమి. ఒకనాఁటిసాయంసమయమున వా
హ్యాళి కేతెంచిన మాకు భవత్ప్రజనులు గనుపించిరి. వారివల్ల
నిచ్చటియుదంత మాద్యంత మాలించి యీమాభద్రాయువు వారల
కభయంబొసంగి సురక్షితులనొనర్చి, యుద్ధమునకు నన్నును బ్రో
త్సహించె. ధనుర్బాణఖడ్గమాత్రసహాయులమై త్వరితగతి సకాల
మునకే యిచటి కేతెంచితిమి. భగవానుని యనుగ్రహమునఁ గృతకృ
త్యులమై భవదాశీర్వాదపాత్రులమైతిమి. తడవయ్యె మాకు సెలవొ
సఁగుడు.

భద్రా॥ అయ్యా! మాచరిత్ర యింకను చాలఁగలదు. మా కిప్పట్లి సెలవొ
సంగుఁడు. పోయి వచ్చెదము.

వజ్రా॥ (చంద్రహాసము నొకదానిందీసి) అనునయగుణవినయా! సునయా!
నిన్నునైతము సన్మానించుట మాకియ్యెడ ధర్మము. కావున నీచంద్ర
హాసముం గైకొని యీభద్రాయుకుమారునకుఁ దోడునీడవై దుష్ట
శిక్షణ శిష్టరక్షణంబు లొనర్చి యశోవిశాలుఁడవు కమ్ము (చంద్ర
హాసము నొసంగును)

సున॥ తీసికొని కండ్లకద్దికొని రాజునకు నమస్కరించి మహారాజా! తమకృ
తజ్ఞతకుఁ జిరకాలము విధేయుఁడ.

సేనాపతి॥ ప్రభూ! వీరు మానవులుగారు. మనల నుద్ధరింప నేతెంచిన దేవ
దూతలు. కాకున్న నవాక్షౌహిణులేడ! ఖడ్గబాణమాత్రసహాయులగు
నీయిరువురు పిన్నవారలేడ? అదియునుగాక తమ్మెరింగించుట కే
లనో సందియ మందుచున్నారు. తప్పక వీరు మానవాతీతచరితుల
ని నానమ్మకము.

భద్రా॥ సేనాపతీ! నీ వింతగా మమ్మెగ్గింప నక్కఱలేదు. పుణ్యపాపసంఘ
ట్టనమునఁ బాప మెంతటిదిదైననుఁ బుణ్యమే జయించును. అమో
ఘములగు మదీయగురుప్రసాదితశరశరాసనఖడ్గశంఖంబులె యిం
తటిమహాకార్యం బొనరించె. అంతియకాని మేము మానవాతీతుల
ము గాము. అయ్యా! తడవయ్యె. మాకు సెలవొసంగుఁడు.

వజ్ర॥ (కుడిచేయిపైకెత్తి) పౌరులారా! ఇష్టిపురుషసింహుల పీఠోత్సవస మయమున జయనినాదము లొనర్పుఁడు 'జయ్ భద్రాయుకుమారునకు జయ్, జయ్ సునయకుమారునకు జయ్' (తెరలో గొప్పధ్వనితో పై విధముగా జయధ్వనులు)

(భద్రాయుసునయులు లేచి నడువ నందఱు వెంబడింతురు)

తెరవ్రాలును.

## చతుర్ధరంగము

(నిషధపుర రాజభవనము- ప్రవేశము— చంద్రాంగదమహారాజు.)

చంద్రా॥ (స్వగతమున) ఆహా! ఈశ్వరవిలాస మతివిచిత్రముగదా? విరాగులనైతము సరాగుల నొనర్చి యనురాగవశత సంసారసాగరనిమగ్నులఁగాఁ జేసి సుఖదుఃఖతరంగముల నుయ్యెల లూపుచుండు. ఎంతటివారికైన నేదే నొకవిచార మాచార మాయెఁగదా. పరమశివకరుణాపాత్రుఁడనయ్యు నక్షయభోగభాగుండగు తక్షకనాగేంద్రుని యనుగ్రహము వడసియు నేకైకపుత్రికకుఁ దగినవరునిఁగూర్చి వివాహం బొనరుపఁ జాలనైతినే! నేనే యిట్లు చింతించుచుండ నిఁక సామాన్యులగతి వేరె యడుగవలయునా? కట్టా! స్త్రీసంతానము చింతాకరముకదా!

తే॥ గీ॥ తనయ కనుకూలుఁడగు వరు • నొసఁగఁగూర్చి
పెండ్లి యొనరించు జనకుఁడు • ప్రేమమీర
కాని ప్రతికూలుఁడగువాని • గట్టఁబెట్టి
తనయదుఃఖంబు నెవ్విధి • తా సహించు!

ఎటి. గినంతవఱకు విచారించితి దేశదేశములకుఁ జారులఁ బంచితి కాని నాకొమరిత నీయుఁదగు రాకొమరుఁ డెవ్వఁడును లభింపఁడయ్యె. విరతశివపదారవిందమిళిందాయమానమానసయగు మాకీర్తిమాలిని శపథకర్త్రాగ్రగణ్యుఁడగు రాకొమరునిదక్క నన్యుల వరింపనని గట్టిపట్టు పట్టుచున్నది.

సేవకుఁడు॥ (ప్రవేశించి) ప్రభూ! మహాఋషీంద్రులు దయసేయుచున్నారు.

చంద్రా॥ [లేచి] ఎవరా మహనీయులు? మహాత్ములగు ఋషిశ్రేష్ఠులుగా రుకదా? (పరిక్రమించి) వారుగో! పూజ్యపాదులగు ఋషిశ్రేష్ఠులే. సేవకా! మహారాణికీవార్త నెఱింగించి పూజాద్రవ్యములఁ గొని రమ్మనుము. నేనిదె మునికుంజరులకు స్వాగతం బొసంగెద. త్వరితముగ రమ్మనుము! పొమ్ము!

సేవ॥ చిత్తము. (నిష్క్రమించును)

(ఋషభయోగి శివగానముతోఁ బ్రవేశింప జంద్రాంగదుండు స్వాగతం బిడుచు దీసికొనివచ్చి యాసనము జూపును)

చంద్రా॥ మహాత్మా! నమస్కారము. ఈ మణిమయాసనము నలంకరింపుఁడు

ఋష॥ మనోవాంఛాఫలసిద్ధిరస్తు. (కూర్చుండును)

(సీమంతిని పూజాద్రవ్యములతోఁ బ్రవేశము)

చంద్రా॥ దేవీ! రమ్ము. మహనీయపదకమలాభిషేకమున ధన్యుల మయ్యెదము.

సీమ॥ మహాత్మా! వందనములు. భగవత్ప్రతినిధులగు మహాత్ముల నర్చించుటయేగదా మానవజీవితపరమావధి.

(సీమంతిని యుదకముఁ బోయుచుండ పసిడిపళ్లెరమున ఋషభయోగిపదములను చంద్రాంగదుఁడు కడిగి జలమును శిరముపై జల్లుకొనును)

ఋష॥ దీర్ఘాయుష్మాన్ భవ. నిషధరాజేంద్రా! మీయట్టిపుణ్యాత్ములవ లననే సృష్టి పవిత్రమై సార్థకత నందినది. నే నియ్యెడ కఱుదెంచి చిరకాలమైన దనుకొందును. మీ కెల్లరకుఁ గుశలమా? నిశ్చింతత నిషధసామ్రాజ్యమును బరిపాలింతువే?

చంద్రా॥ దేవా! భవదాశీర్వాదబలంబున నేచింతయు లేక పాలింతు — కాని

ఋష॥ ఆ! కాని— యనుచుంటివేమి? సందియమేల? వివరింపుము?

చంద్రా॥ మునీంద్రా! సందియమేల? కలదుకదా మా కొకకొమరిత. ఆమె నుగీర్తిమాలిని యండ్రు. సద్గురుఋషిచే పరిపూర్ణవిద్యావతియై యిపుడు పరిణయయోగ్యయైయున్నది. సదాశివధ్యానమనస్కయగు నామెపాణిఁ బరిగ్రహింపఁదగు వరుం డీభూలోకంబున నెందును గానరాఁ డయ్యె స్వామీ! ఇదియే మావిచారవిషయము.

ఋష॥ ఓహో! అదియా కారణము సంతానవంతులగువారి కందఱకు నిట్టి చింత సహజమేకదా ఇంతకు వరలక్షణము లెట్లుండవలెనని మీ యుద్దేశ్యము.

చంద్రా॥ మహనీయా! మాయుద్దేశ్య మేల? శివభక్తాగ్రణియగురాకొమరు నిదక్క నన్యుల వరింపనని తల్లితో ననుచుండునఁట విచారింపుఁడు?

ఋష॥ ఏమి సీమంతినీ! ఈమాట నిక్కువమా?

సీమ॥ నిజము. మహాత్మా! నే నెపుడు ప్రశ్నించినను నదియే సమాధానము.

ఋష [నవ్వుచు] తల్లీ! గోగర్భమున గోమాయువు జనించునా? భక్తాగ్రగణ్యులగర్భమున, భక్తమణియే జనించినది. కాని— సుగుణాకరుఁడగు రాకొమరుఁడే దుర్లభుఁడు.— అందును, శివభక్తశిరోమణి వలయునన్న సామాన్యమా? (ఆలోచించుచు) పుణ్యులగు మీయెడ దాపరిక మేల? అట్టివాఁ డీభూలోకముననే కలఁడు.

చంద్రా॥ మహాత్మా! ధన్యోస్మి. అతఁ డెవ్వరో వివరించి, కర్ణపేయ మొనర్పుఁడు.

ఋష॥ విను మః దశార్ణదేశాధీశ్వరుఁడైన వజ్రబాహువునకు పెద్దభార్య
యందొకకొమరుఁడు జనించె. అసూయాపరలగు సవతులామెకు
బూర్ణగర్భమున విషప్రయోగ మొనర్చినకారణమున, యాజననీ
శిశువు లిరువురు మరణింపక సర్వాంగవ్రణపీడితులై నిరంతరరోదనాది
దూషిత సంతతపురంబునకు వంతఁ గూర్చిరి తన్మాయానభిజ్ఞుఁడగు
రాజు కనిష్ఠపత్నీసంసక్తుఁడయి తత్ప్రేరణవలన నాజననీశిశువుల న
డవులపాలుఁజేసె పిమ్మట నాజననీతనయులు మోరాటవులఁ గడచి
కొంతకాలమున కొకపురముఁ జేరి పద్మాకరుఁ డనువానియింటఁ
జేరఁగాఁ బురాకృతకర్మపరిపాకంబున నాబాలుఁడు పంచత్వమును
బొందె. నేనట్టియెడ దైవయోగమున నాదారి నేండేఁ బోవుచుండ
నను గాంచి యాపద్మాకరుఁడు ప్రార్థనాపూర్వకముగ నన్నాయిడ
కుఁ గొంపోయె. బాలుని గాంచిన నేను వాని శివభాగవతోత్తమునిగ
భావించి, తపఃఫలప్రభావంబునఁ బునర్జీవితు నొనర్చి "భద్రాయు"
వను నామం బిడితి. పిదప నావైశ్యునకు సునయుండను కుమారుం
డు కలిగె వార లిరువురు సమస్తవిద్యాపారంగతులైరి. ఇట్లుండ
పుణ్యవంతుల వంతలపాలొనర్చిన దురితమునంజేసి వజ్రబాహుఁడు
పెనువంతలపాలయ్యె. మాగధుండగు హేమరథుం డుక్కుమిగిలి
దశార్ణనగరముఁ జుట్టుముట్టి జయించి, వజ్రబాహుని సపత్నీకముగ
చెఱయందునిచె కాందిశీకులగు పౌరులఁగాంచి భద్రాయువు, సున
యసహాయుఁడై వారల కభయమిడి, దశార్ణనగరం బేతెంచి, మాగ
ధులపీచ మడంచి, జనకాదుల బంధముక్తుల నొనర్చి, తన్నెఱింగిం
చుకొనకయే సన్మానమంది వైశ్యపురముఁజేరి సుఖం బున్నవాఁడు.
ఇంతియకాక—

చం॥ అనఘ జతుస్సహస్రసుర • హాయనముల్ మని ధర్మయుక్తుఁడై
భువనతలంబు నేలఁగల • భూరియశోవిభవాభిరాముఁడై

నవము లొనర్చు, సద్గుణాఢ్యులగు నాయురఁ బుత్రులఁ గాంచు పత్నియై
శివపదపంకజంబులను జెంది చరించుచు నీవు మేటివై.

కావున మీయుభయుల కిష్టమయ్యేని యీరాజపుత్రునకు మీసుత నొసంగి యుద్వాహ మొనర్చి ధన్యులు కండు.

భద్రా॥ మహాత్మా! మీ రాదేశించుటయు మేము కోరుచుంటిమి? నేఁడే యీ శుభసమాచారము మంత్రిపురోహితుల కెఱింగించి వలయుసన్నాహము లొనర్చి తమసన్నిధానముననే యుద్వాహ మొనర్చెద అంతదనుకఁ దామిటనే వసించి మమ్ముం గృతార్థులఁ జేయ వేఁడెద.

సీమ॥ దేవా! భవదాగమనము శుభయోగమై మా కెంతయు సంతసము గూర్చె

ఋష॥ అమ్మా! సర్వేశ్వరుఁడు మీ కిష్టదైవమైయుండ నభీష్టసిద్ధి చేకూర కుండునా?

చంద్రాం॥ మహాదేవా! కాలాతిక్రమణమైనది, కార్యముల నిర్వర్తింప లెండు.

ఋష॥ ఆ! సంభాషణాసక్తపరత, గమనింపనైతి (లేచి నడుచును.)

(అందఱు నిష్క్రమింతురు తెరవాలును)

# భద్రాయువు

## పంచమాంకము.

### ప్రథమరంగము.

పద్మాకరుని గృహము — సుమతీ భద్రాయువుల ప్రవేశము

భద్రా॥ అమ్మా! నీ వెట్లయినఁ జెప్పుము. మన మీస్థితిలోఁ బండితులగారి కంటఁబడుట యనుచితమనియే నాతలంపు.

సుమ॥ నాయనా! కంటఁబడక చేయునదేమి? మన కీపరిచ్ఛన్నవృత్తి యెన్నినాళ్ళు? పోనిమ్ము. గురుదేవులు వచ్చినపిదప వారిని బురస్కరించుకొనియైనఁ బోవుదమా? ఆమహనీయుఁడు చెప్పినను వినకున్న నావల కర్తవ్యము విచారించుకొందము.

భద్రా॥ తల్లీ! అట్లు కాదు. మనమై పోయితిమేని నేఁడుకాకున్న రేపైన నీపతులకుఁ జిక్కక గాకమానము. అంతియగాక

తే॥ గీ॥ న్యాయ మింతయు లేకయే • నన్ను నిన్ను
విపినసీమలఁ బనిపిన • నీచుకడకు
ఏమొగముపెట్టి యేగెద • నిపుడు తల్లి
సర్వవరదుఁడె సకలంబుఁ • జక్కఁ జేయు.

సుమ॥ నాయనా! లోకవృత్త మెఱింగిన నిన్నిఁక నాజ్ఞ సేయఁజాల.

దాసి॥ [ప్రవేశించి] అమ్మా ఎవరో గుఱ్ఱమెక్కి వచ్చారు. "భద్రాయు కుమారుఁ డుండునది యెచ్చట?" అని అడుగుచున్నారు.

సుమ॥ కుమారా! ఎవ్వరై యుండును? త్వరితముగ నేగి విచారింపుము. నేను లోనికేగెదను. దాసీ! రమ్ము. (నిష్క్రమింతురు)

(భద్రాయువు [illegible] వారల సగౌరవముగ [illegible] సింహాంగదుని మంత్రిపురోహితులతోఁ బ్రవేశించుచు)

భద్రా॥ పుణ్యులారా! సుఖాసీనులు కండు.

పురో॥ (కూర్చుండి) రాజకుమారా! మహాత్ముఁడ వగు నీకు క్షేమమా?

భద్రా॥ చిత్తము. మీవంటి మహాత్ముల కరుణవలన క్షేమముగనే యున్నారము. అయ్యా! తమకుల దేశ నామంబులను, ఆగమన కారణంబును విన వేడుక వొడమెను.

మంత్రి॥ (నవ్వుచు) రాజకుమారా! వేడుక లెఱింగించుటకై యే మా యీ యాగమనము. మేము నిషధసార్వభౌముని మంత్రి పురోహితులము. మా మహారాజునకుఁ బార్వతీశ్వరుల యనుగ్రహంబున నొకపుత్రిక యుద్భవించినది. ఆమెను కీర్తిమాలిని యందురు. సర్వవిద్యాభారతి, సౌందర్యరతి యగు నామె పరిణయయోగ్య యగుట నాబాల నిప్పుడు నీకేల నిడనెంచి సింహాంగదుఁడు మమ్ము నీయెడ కనిపె.

భద్రా॥ (వికటముగ నవ్వుచు) అయ్యా నన్నుఁ బరిహసించుచుంటిరా? నిషధేశ్వరుఁడు మా పరిస్థితుల నెఱుంగకయే యిట్టు లాదేసించి యుండనోపు లేకున్న.

తే॥ గీ॥ ఇల్లు వాకిలి లేక వ ♦ రేవ్ఫ యిట్లు
వైశ్యగృహమున వసియించు ♦ వాఁడ నేడ
నిషధరాట్కన్యకర మంది ♦ నెగడు టేడ
హాస్య మాడుట తగునె మ ♦ హాత్ములకును.

మంత్రి॥ వీరశిఖామణీ! మేము నిన్ను మేలమాడుటకు రాలేదు. (పురోహితునితో) అయ్యా! శుభలేఖ నందింపుడు.

పురో॥ రాజకుమారా! నీజననిని వైశ్యసత్తముని రావింపుము. పెద్దలయెదుట నీ శుభలేఖార్థముల వినుపించెదను.

భద్రా॥ చిత్తము! (నిష్క్రమించి మరల సుమతీపద్మాకరులతోఁ బ్రవేశము)

పద్మా॥ నిషధపురనివాసులగు మహాత్ముల కభివాదనములు (నమస్క-
రించును)

పురో॥ వైశ్యసత్తమా! మారాజాజ్ఞానుసారము గొనివచ్చిన శుభలేఖను జదు
వుచున్నాను సావధానులై వినుఁడు. (లేఖను విప్పి.)

శ్రీరస్తు శుభమస్తు

సమస్తసుగుణగణ విలసిత వీరశిఖామణియగు భవాద్విధువును, శ్రీ
మత్సదాశివ పదకమల మధుపానమిళిందుఁడగు చంద్రాంగదుఁడు, చిరంజీ
విగ నాశీర్వదించి వ్రాయు శుభలేఖార్థములు "సదాశివప్రీతిమానులగు ఋ
షభయోగీశ్వరుల యాదేశానుసారము. సుగుణసౌందర్యాలవాలమగు నా త
నయఁ గీర్తిమాలినిని నీకొసంగి పరిణయం బొనర్ప నిశ్చయించినారము.
సుముహూర్తము దాపుననే యుంట భవజ్జననీ పద్మాకర బంధుమిత్ర పరి
వారసమేతుఁడవై వెల్లియే, తరలి రావలయు. ఇట్లు భవచ్ఛ్రేయోభిలాషి
—ముద్ర—నిషధసార్వభౌముఁడగు చంద్రాంగదమహారాజు—

(ఒకరిమొగము లొకరు జూచుకొని మందహాస మొనరింతురు)

పద్మా॥ మహాత్ములారా! నిషధసార్వభౌముఁ డాజ్ఞాపించుటయు మేము గా
దనుటయునా? అందును ఋషభయోగీశ్వరులయాజ్ఞ మాకు సర్వదా
శిరోధార్యముగదా! —అయినను సుమతిదేవియభిమతం బరయుట
శ్రేయస్కరంబని నాతలంపు (ఆమెవంకఁ జూచును)

సుమ॥ తండ్రీ! నాయభిమత మేల? నీయాదేశముఁ గాదందునా?
కాని— ఇట్టిదైన్యావస్థలో నిషధపురికిఁ దరలిపోవు టెట్లా —యని.

పద్మా॥ తల్లీ! ఏల నీకీసందియము? నా యీసర్వస్వము మీయది కాదా?
సమస్తవైభవసమేతంబుగ నీకుమారుఁడు పెండ్లికుమారుఁడై తరలి
పోఁగలఁడు. విచారింపకుము. — మహాత్ములారా! మాచే నొసం
గఁబడు యథోచితసత్కారములంది మము కృతార్థుల నొనర్పుడు
—దయ సేయుఁడు.

(అందఱు నిష్క్రమింతురు— తెరవ్రాలును)

## ద్వితీయరంగము

(కల్యాణమంటపము. భద్రాయువు కీర్తిమాలిని పూలదండలచేతఁ బట్టుకొనియుండ, చంద్రాంగదుఁడు, సీమంతిని, ఋషభయోగి, కల్యాణోత్సుకులగు బ్రాహ్మణులు, వజ్రబాహుఁడు, రాజబంధువులు యథోచితముగను బ్రవేశింతురు)

చంద్రా॥ (నమస్కరించి) దేవా! ఋషభయోగీంద్రా! తమయానతిమేరకు సర్వము సిద్ధంబయ్యె ముహూర్తమతిక్రమింపకుండ, పాణిగ్రహణ మొనర్పించి శుభాశీర్వాదంబుల నిచ్చి వధూవరుల ధన్యులఁ జేయ వేఁడెద.

ఋష॥ శివం భూయాత్! చంద్రాంగదా! అట్లే యగుఁగాక. చిరంజీవులారా! నేటి యీపవిత్రసుముహూర్తంబున మీరిరువురు దంపతు లగుచున్నారు. సర్వేశ్వరుఁడు మీకు సత్సంతానసౌభాగ్యబహుసుఖంబు లొసంగి రక్షించుఁగాక. పుణ్యులారా! ఇంక మీ రన్యోన్యపుష్పమాలాలంకృతులు కండు. ఆవల యథోక్తముగ వైవాహికవిధుల నెరవేర్చుకొనవచ్చును.

(వధూవరు లొకరిమెడ నొకరు పూలదండలు వైచికొందురు. అంతట శుభాక్షతలు, పుష్పములుఁ జల్లుచుండ భద్రాయువు కీర్తిమాలినిపాణి, గ్రహించుచు, జయజయధ్వానములు వాద్యములు మ్రోగగను)

ఋష॥ చిరంజీవులారా! ధన్యులైతిరి.

చం॥ అవనిఁ జతుస్సహస్రసుర • హాయనముల్ మని ధర్మయుక్తులై
భువనతలంబు నేలుచును • భూరియశోవిభవాభిరాములై
నవము లొనర్చి సద్గుణవి • శాలురఁ బుత్రులఁ గాంచి భక్తులై
శివపదపంకజంబుల భ • జించి తరింతురుగాక పుణ్యులై

చంద్రా॥ (కూతును దగ్గఱకు తీసికొని బుజ్జగించుచు) తల్లీ! కీర్తిమాలినీ!

మ॥ అనుకూలుండగు సద్విభున్ బరిణయం • బాడంగ దీక్షారతిన్
మనమం దెల్లపు డూహసేయుదు గద • మ్మా నేఁడు నీవాంఛితం

పొనఁగూడెన్ సద తల్లి నీవిభునితో • నత్యంత్రమోదాత్మవై
జని ధన్యం బొనరించు కొమ్మఁ గను స • త్సంతానసౌభాగ్యవై

[పరిక్రమించి] మహాత్ములారా! మీయెల్లరకరుణావిశేషంబున సత్పాత్రుండగు నీయనఘునకుఁ గన్యాదానం బొనర్చి ధన్యుండనైతిని. మీ కెల్లరకు నివియె ధన్యవాదసహస్రంబు లర్పించుచున్నవాఁడ.

సీ॥ (కౌమరిత నుపలాలించుచు) అమ్మా! పరాత్పరుని దయాప్రభావంబున నీకోరినయట్లు విభుఁడు లభించె. జగజ్జనని వచించినటుల నీవలన నుభయకులంబులు వర్ధిల్లుఁగాక. సర్వమంగళాదేవియనుగ్రహంబున దీర్ఘసుమంగలివై సత్సంతానసంపదలఁ దులఁదూగెదవుగాక.

తే॥ గీ॥ సోమవారంబులందు ను • మామహేశ
వ్రతనియతి నల్ప భక్తిమై • బడసినార
మమ్మ నిను, గాన నవ్వ్రత • మాచరింపు
డిహపరానందపాత్రులై • యొనగఁ గలరు.

వజ్ర॥ (వధూవరులఁ జూచుచు) చంద్రాంగదమహారాజా! ప్రస్తుతదృశ్యమంతయు నాకొకయింద్రజాలమువలెఁ దోఁచుచున్నది. నిజముగ నాకన్నులతోడనే చూచుచుంటినా? లేక స్వప్నావస్థయం దుంటినా? యను శంక బాధముచున్నది. ఏలయన—

ఉ॥ ఈమహనీయు లిర్వురు న • హీనపరాక్రమలాన్యసంపదన్
మామకరాజ్యహర్తలగు • మాగధవీరుల నుక్కడించి తా
రన్ మము బంధముక్తులుఁగ • రంజిలఁ జేసిన వీర రెవ్వరో
యేమహితాత్మపుత్రికులొ • యిద్ధచరిత్రః వచింపు మియ్యెడన్.

చంద్రా॥ (వికటముగ నవ్వుచు) బావా! వజ్రబాహుమహీపాలా! నే నైంద్రజాలికుఁడఁగాను మాతాత నలచక్రవర్తి. తండ్రి యింద్రసేన మహారాజు. చంద్రాంగదుఁ డనువాఁడ. పితృబాంధవ పరిత్యక్తుఁ

దై జననితో నొకవైశ్యగృహమున నున్నవాని నెట్టులో పట్టితెచ్చి నాపట్టిగోసంగితి. పీరశిరోమణియగుని బంధుత్వ మేమైనఁ గల్పించుకొన నెంచితివా యేమి?

(అందఱు నవ్వుదురు. వజ్రబాహుఁడు పైకి చూచును)

చంద్రా॥ బావగారూ! ఏమట్లు చూచుచున్నారు? ఆకశమున నేమియున్నది? పూర్వస్మృతి యేమైనఁ గల్గుచున్నదా యేమి? విభ్రాంతిఁ జెంది యుండు టైనను నీవె యననేల. మానవహృదయఫలకము లన్నియు నయస్కాంతమయంబులు గానోపు. సర్వేశ్వరునిలీల దురూహముగదా.

తే॥గీ॥ స్వస్థచిత్తము లేనట్టి ♦ జనుస కిలను
కష్టవశనున్న బంధువుల్ ♦ గానరారు
దుష్టులైనను బెరవార ♦ లిష్టులౌచు
రౌర మానవుం డెంతటి ♦ స్వార్థపరుఁడొ.

వజ్ర॥ (తత్తరమున లేచి చంద్రాంగదుని చేతులు పట్టుకొని) నిషధసార్వభౌమా! వ్యంగ్యములగు నిట్టిపోటుమాటలచే నేల కోఱియ వెట్టెదవు? యథార్థము వచించి నాసంశయము వాపుము.

చంద్రా॥ అయ్యా! సంశయములన్నియుఁ దీర్ప సర్వజ్ఞుఁడగు ఋషభయోగీంద్రుండె కలఁడు. అమ్మహాత్మునివలన సర్వము నెఱుంగవచ్చును.

వజ్ర॥ [నమస్కరించి] మహాత్మా! ఋషభయోగీంద్రా! చంద్రాంగదుఁడు వచించినట్లు స్వస్థతలేని నాచిత్తమునందలి సందేహమును బాపి యనుగ్రహింపుఁడు.

ఋష॥ (మందహాసమున) రాజా! తత్తరమేల? వినుము. సుమతికిఁ బూర్ణగర్భమున సవతులు గరళాన్న మిడిరి. అది కారణముగ, సజ్జనపీశిశువులు దుర్భరవ్రణపీడితులై సతతరోదనావిష్టులైరి. కనిష్ఠపత్ని

సంసక్తుఁడ వసిష్ఠ నామెవాక్యములఁ బాటించి ధర్మనిర్ణయు మొ
సర్పఁ గాలక వార్యాప్తపుత్రిల నడపినా వొనర్చితివి. వాఁడెట్లో యొక
పురమఁ జేరి పద్మాకరుఁ డనునొకపై శ్యునిగృహమునను౦డి, నిష్ప
త్రిరుఁ విగతదేహుఁడై దైవికముగ మదీయ తపఃఫల ప్రభావంబు
నఁ బునర్జీవితుఁడు డయ్యె. వెండియు మదుపదేశంబున వికటవ
మంత్రసిద్ధియు ద్వాదశసహస్రమదగజబలంబును, పరిపంథి సం
మ్మోహననిగ్రహసమర్థంబులగు శంఖఖడ్గంబులు నొంది, మాగధ
పీసల నుక్కడించి మీరాజ్యము నిష్కంటక మొనర్చె నేనే బహు
మానము లందినది నీతనయుఁడే! ఈపెండ్లికొమరుఁడే! ముమ్మం
చు జగద్విఖ్యాతిగా నేకచ్ఛత్రాధిపతియై వసుంధర నేలనున్న యాభ
ద్రాయువు నీకొమరుఁడే! రాజా! దేనికిఁగాని పూర్వాపరవిచార మవ
శ్యాచరణీయము. పశ్చాత్తప్తుఁడవై పరమపతివ్రతాశిరోమణి యు
నఁదగు సుమతి నను గ్రహించి వంశవిస్తారుఁడగు కుమారు నభి
మానింపుము. చంద్రాంగదా! చిరవియోగపరితప్తులగు దంపతుల
నొకచోఁ జేర్చి వారల కానందముఁ గూర్చుము.

చంద్రా॥ చిత్తము! (లోనికిఁ బోవును.)

వజ్ర॥ మహాత్మా! ఋషభయోగీంద్రా! జగన్నాటకసూత్రధారియగు సర్వ
జ్ఞప్రతిమానుండవు. మాయావిషాదనాటకసూత్రధారివై మదీయ
వంశవిచ్ఛేదము గాకుండఁ గాపాడితివి. దేవా! కృతజ్ఞుఁడ. (నమ
స్కరించును)

ఋష॥ రాజా! కష్టములు సుఖముకొఱకును, సుఖములు కష్టముకొఱకును
వచ్చుచుండును. పిచ్చివాఁడా! విషాదనాటక మనియెదవేల? ఆనం
దాంతము కానున్నది.

(చంద్రాంగదుఁడు సుమతి ప్రవేశింతురు వజ్రబాహుఁ డాశ్చర్యముతోఁ
జూచుచుండ సుమతి ఋషభయోగిపాదములకు నమస్కరించును)

సుమ॥ దేవా! ఈయభాగినినమస్కృతు లందికొనుఁడు.

ఋష॥ అమ్మా !ఇంకను నభాగినేనా? కాదు— సుభాగినివే యగుదువుగాక— అదిగో! నీప్రాణపతి పశ్చాత్తప్తుఁడై గతమునకు చింతించుచు న్నాఁడు. హోమ్మా! పతి నభిమానింపుము. మానవులకుఁ బశ్చాత్తాప మే సమస్త పాపానోదనము.

(సుమతి మెల్లగ వజ్రబాహునికడకేగి పాదములంటి కన్నీరు తుడుచుకొను చుండును. వజ్రబాహుఁ డామెను లేవఁదీసి చేయిపట్టుకొని)

వజ్ర॥ దేవీ! గర్వాంధుఁడనై మర్యాదనలఁ జెనినిడి మదీయభాగ్యదేవత వగు నిన్నును (కుమారుని దగ్గఱకుఁ దీసికొని) వంశతిలకుండగు కుమారుని, విపినమున కంపిన పాపిని, జడుఁడను. అనుగ్రహింపు ము. స్త్రీశిశుహత్యాపరుండనగు నే నిపుడు పశ్చాత్తాపవహ్నిని మ్రగ్గు చున్నవాఁడ. దేవీ! భవద్వాగమృతధారల నించుక మనశ్శాంతి నొ సంగుము—— లేకున్న నసువులఁ బాసెద.

సుమ॥ (కన్నీరు తుడుచుకొనుచు) నాథా! ఇందు మీదోస మిసుమంతయు లేదు. జిహ్వాచాపల్యంబునఁ బరీక్షింపకయే పరమాన్న మారగించి న దోషము మమ్మిట్టిదుమపాళు నేసినది. ఆనారతరోదనంబున నంతఃపురసౌఖ్యము భ్రష్టమగునని పురోహితానుమతిని మమ్మర ణ్యముల కనిపితిరి. ఇందు మీత ప్పేమున్నది? అంతయు మా పారబ్ధము, దైవనియోగము.

వజ్ర॥ అదిగో! ఇంకను నీవు నన్ను క్షమించుట లేదు. నాపాపకృత్యములనే మరల నుద్ఘాటించుచున్నావు!

ఋష॥ పుణ్యదంపతులారా! ఇం దెవరిదోషమును లేదు, పూర్వజన్మకర్మా నుసారముగ జీవులకు సుఖదుఃఖములు ప్రాపించుచుండును. ఎంత టివారును దైవదుర్విపాకమునకుఁ దలలొగ్గి తీరవలసినదే. కావు ననే "విధి ర్బలీయసీ" యందురు. పశ్చాత్తప్తులై పాపపరిహార

వందురు. వధూవరులారా! అట్లు చూచెదరేల? పూజ్యులగుతలి
దండ్రులు! అత్తమామలు! ఊ! నమస్కరించి యాశీర్వాదములఁ
బొందుఁడు.

(వధూవరులు తొలుత ఋషిశ్రేష్ఠునకుఁ బిమ్మట సుమతీవజ్రబాహుప్రభృతులకును నమస్క-
రించెదరు ఆశీర్వాదములఁ బొందెదరు)

వజ్రి॥ (కుమారుని కౌఁగలించుకొని కపోలముఁ బిముడుచు) కుమారా:
నీయట్టి వినయవివేకపరాక్రమశాలినిఁ బుత్రునిఁగాఁ బడసిన నాజ
న్మము, వంశము ధన్యంబు లయ్యె. చరితార్థుండ నైతిని.

భద్రా॥ తండ్రీ! అంతకును గారణము నీవెకదా. నిజముగ నీవట్లు విడచు
టవలననే యీమహాత్ముల యనుగ్రహమున నిట్టివిద్యలు, వైభవ
ములు వచ్చినవి.

వజ్రి॥ ఆహా! నేఁడుకదా! సుదినము.

ఆ॥ వె॥ ప్రాణవిత్తమాన • భంగంబుఁ గాచిన
మనుఁడె నేఁడు నాడు • తనయుఁ డయ్యె
దుష్టచేతనమున • దుర్మార్గ మంపిన
వనిత బ్రతికి వచ్చెఁ • బ్రాణసతిగ.

(భార్యను బుత్రుని జెరియొక చేతఁ గౌఁగలించుకొని యానందబాష్పముల విడచును.)

ఋష॥ ఆహా! ప్రేమమహిమ పరమాద్భుతముగదా!

తే॥ గీ॥ ప్రేమ మహిమాభిరామము • విశ్వమయము
ప్రేమ మధురాతిమధురమై • వెలయు నెపుడు
ప్రేమయే సర్వజీవైక • కామితంబు
ప్రేమ లేకున్న జీవికి • విశ్వ మేల?

చంద్రా॥ బావా! దశార్ణమహారాజా! తడవయ్యె. వైవాహిక విధిశేషంబు లట్లే
యుండినవి. మహాత్ములగు భూసురవర్గంబును బంధువులను రాజ
లోకంబును యథావిధి సత్కరింపవలయు. లోనికి దయచేయుఁడు.

(నమస్కరించి) మహాత్మా! ఋషభయోగీంద్రా! కాలాతిక్రమణం బయ్యె దయసేయుఁడు.

(చంద్రాంగదుఁడు దారిఁ జూపుచుండ ఋషభయోగియు నాతని వెంటను వరుసగను నిష్క్రమింతురు.)

తెర వ్రాలును

## తృతీయరంగము

(నిషధరాజభవనము— వజ్రబాహు సుమతీ భద్రాయువు లొకప్రక్కను చంద్రాంగద సీమంతినీ కీర్తిమాలిను లొకప్రక్కను నిలబడియుందురు)

చంద్రా॥ బావా! వజ్రబాహుమహీపాలా! మాయీకీర్తిమాలిని లోకజ్ఞాన మిసుమంతయు లేనిది. మొన్నమొన్న నే గురుకులవాసము విడచినది. కాన నామెయం దెట్టినేరము లుండినను సైరించి యథోచిత ధర్మోపదేశంబు లొనర్చి కాపాడుమని నామనవి.

వజ్ర॥ అయ్యా: మహాత్ములగు మీగర్భమున జనించిన యీయమ, గుణవతి కాకుండునా? ఉభయకులపావనియని యీమె ముఖలక్షణము తే చెప్పుచున్నవి.

చంద్రా॥ (భద్రాయువుతో) గుణనిధీ! వివేకశిరోమణివగు నీకు ధర్మోపదేశ మొనర్చునంతటి వాఁడను గాను. పెద్దవాఁడనగుటఁ జెప్పకతప్పదు.

చం॥ అనయము విశ్వనాథు మన • సార భజించుచుఁ దల్లిదండ్రులన్
వినయపుసేవలం దనిపి • ప్రేముడి బంధుల గారవింపుచున్
జనసుత రాజ్యవర్ధన వి• శాలయశోధన భాగ్యభోగ్యతన్
మనుము సతీసమేతముగ • మానవనాయక! సర్వకాలముఁ.

భద్రా॥ ఆర్యా! భవదాశీర్వచన మమోఘమగుఁగాక!

చంద్రా॥ అమ్మా! సుమతీ! అదర్శసాధ్వీలలామవు నీకు వేఱుగాఁ జెప్పఁజని లేదు. ఐనను పరిమాదవశంబున నేదేని నొసంగు పొసగినను నీకో డలి నొకకంటఁ బ్రేముడి నాదరింతువని నావిశ్వాసము.

సుమ॥ అమ్మా! మీతనయ నిజముగఁ గీర్తిమాలినియే యై యుభయకులపా వని యగు. సందియ మాంతయు లేదు. కులకాంతలకుఁ దలమా నికమగుఁ దగ్గి మా పెద్దల కానందసంధాయిని యగు గాన మీరు ని శ్చింతి నుండుఁడు.

సీమ॥ (కన్నీరు తుడుచుకొనుచు) తల్లీ! కీర్తిమాలినీ! పూర్వపుణ్యవశంబున సుశీలురగు సత్తమామలను, సుగుణమణియగు భర్తను బొందితివి. నీ కేమిటను గొఱంతఁ గలుఁగనియము. నిరంతర మప్రమత్తులమై నీసేమ మఱయుచుందుము. సఖీజనంబులు సైతము నీవెంటఁ జను దేర సమిత్సాహ్యరుచున్నారు. మాచే నొసంగఁబడిన సమస్తవస్తుసంభా రధనకనకదాసదాసీజనంబులతో నత్యానందముగ నత్తవారింటి కరిగి సార్థకనామధేయవై యచిరకాలంబున మానయనానంద మొనరించు పుగాత (నవ్వుచు) సీమంతోన్నయనమున కేతెంతుము లెమ్ము.

కీర్తి॥ (సిగ్గుతోఁ దలవంచి నవ్వుచు] జననీజనకులారా! కని పెంచు గారాబము నఁ బెనిచిన మీయెడఁబాటు సహింప నేర్తునా? సఖీజనం బెంతయు న్నను, గొఱంతలేని భాగ్యభోగ్యములున్నను మనసునకు మాతాపిత రులమీఁది మమత తీరునది కాదుకదా?

తే॥ గీ॥ భక్తిఁ బరమేశు సేవించి • పడసినారు
పేర్మిమమీరంగఁ గొన్నాళ్లు • పెనిచినారు
విధివిహితమగు పంపుటి • వేళ నన్ను
కరము కొనుఁ డిదె నానమ • స్కారశతము.

చంద్రా॥ [కూతును జేరఁదీసి తల నిమురుచు] తనయా! అధిగతవినయా! నీజననంబున మాతనువులు సార్థకంబయ్యె. పార్వతిం గనినపర్వ తేశ్వరుని మాడ్కి ధన్యతమచరితుండనైతి. మహోజ్జ్వలభవితవ్య మగు నీచరిత మాలించి మహానంద మందెదముగాక.

సీమ॥ తల్లీ! నీవు విద్యావివేకసంపన్నురాలవు. నీకుఁ దెలియని ధర్మములు లేవు, ఐనను మాకుఁ జెప్పక తీరదు

సీ॥ అతిథభక్తి నిరతంబు • నత్తమామలసేవ
లొనరించి పుణ్యంబు • లొందు మమ్మ
పతియాజ్ఞ భక్తిమై • సతతంబు తలఁదాల్చి
అనుకూలపతి వౌచు • నలరు మమ్మ
అపహాస్యమునకైన • నపలపింపక నేవ
కాళిని దయమీర • నరయు మమ్మ
భూతదయాపరి • పూతమనస్కవై
దానధర్మంబులఁ • దనుపు మమ్మ

తే॥గీ॥ ఎట్టికష్టసుఖంబుల • నేని సతము
పార్వతీశ్వరపదభక్తి • వదల కమ్మ
కడుపు పండఁగ మరల మా • కనులఁ దనియ
వత్తువు కదమ్మ శుభముల • వరలు మమ్మ.

భద్రా॥ మామా! నిషధసార్వభౌమా! కాలాతిక్రమణ మగుచున్నది. ఇంక మాకు సెలవొసంగుడు పోయి వచ్చెదము.

చంద్రా॥ [పైకిఁ జూచి] ఔను! ఆత్మీయవాత్సల్యము కాలపరిమాణంబును సైతము మఱపించుచున్నయది, చిరంజీవులారా! సుఖంబుగఁ బోయి రండు మార్గమున నెట్టియిడుమలు గలుగకుండఁ బంచభూతములు మిమ్ము రక్షించుగాక. కులదైవమగు సదాశివుండు తోడునీడ యగుఁగావుత. [ఆశీర్వదించును]

(నే ప థ్య ము న)

(మహారాజా! వత్రియాణసన్నాహ మంతయు సంసిద్ధమైనది. సుముహూర్తము మించకుండఁ బయనము కావలెనని గురుదేవులయాజ్ఞ.)

భద్రా॥ అమ్మా! గురుదేవులుసైతము ప్రబోధించుచున్నారు! కడుచి పోఁగవలసియున్నది. (నమస్కరించుచు) మా కింక ననుజ్ఞ దయ సేయుఁడు.

చంద్ర॥ అభీష్టావాప్తి రస్తు— శ్రేయఃప్రాప్తి రస్తు.

(అందఱు నిష్క్రమింతురు)

తెర వ్రాలును.

## చతుర్థరంగము

(వైశాఖరాజప్రాసాద ప్రాంగణాలంకృత పట్టాభిషేక మండపము.)

(సింహాసనమున భద్రాయువు, కీర్తిమాలినియు, యథోచితాసనములఋషభయోగి, వజ్రబాహువు, చండాంగదుఁడు, పద్మాకరుఁడు, సునయుఁడు, చంద్రశర్మ, జయసేనుడు నాసీనులైయుండ తెర యెత్తబడును)

వజ్ర॥ [లేచి పరిక్రమించి] మహాజనులారా! ప్రారబ్ధవశంబున నాచేఁ బలునిడుమలఁ గుడిచి దయార్ద్రహృదయుఁడగు పద్మాకరునిగృహమునఁ బెరుగుచుఁ బరమేశ్వరాంశసంభవుఁడగు ఋషభయోగీశ్వరుని యనుగ్రహమున భద్రాయువు నొంది, నిషధరాజేంద్రుని జామాతయై మీయువరాజు సతీసమేతముగ నగరున కేతెంచె. నేను వయోవృద్ధుండనైతి. బహువిధక్లేశపరంపరల మనోదార్ఢ్యమును దగ్గినది. పరిపాలనాభరంబు వహింప నశక్తుండనైతి. కావున గురుదేవులయానతిని మీయెల్లర సమక్షంబునఁ జిరంజీవికిఁ బట్టాభిషేకమొనరించి పార్వతీశ్వరచరణానుస్మరణంబున జన్మసాఫల్యము నొందఁ గృతనిశ్చయుఁడనైతి. నా యీ యభీష్టమునకు మీ రెల్లరామోదించి నను ధన్యునిఁ జేయుదురుగాక.

(తెరలోఁ గంటానాదములు. భద్రాయుమహారాజా! జయ విజయీభవ అను జయధ్వానములు చెలఁగె. వసిష్ఠమహాముని భద్రాయు శిరంబునఁ గిరీటము నుంచెను. పుష్పవృష్టి కురియును.)

ఋష॥ తే॥ గీ॥ అచల మైశ్వర్య మస్తు దీ ♦ ర్ఘాయు రస్తు
వీర్యవిక్రమతేజోభి ♦ వృద్ధి రస్తు
భూరిసాద్గుణ్యసౌజన్య ♦ భూతి రస్తు
పార్వతీశ్వరకరుణాకృపా ♦ ప్రాప్తి

చంద్రా॥ రాజా: శత్రుహ్యుఁడవైనను గానున్న యేలికయుమత్తైహిత్యధర్మ మా
శీర్వాదము. కాన

ఉ॥ స్వస్తి దశార్ణరాజకుల ♦ సాగరపూర్ణశశాంక! సర్వదా
స్వస్తి సమస్తధర్మనుని ♦ శౌర్యపరాక్రమవిక్రమాఢ్య! స్వ
స్త్యస్తు వదాన్యతాలసి ♦ హాసముఖాంబుజ! ధీరవర్య స్వ
స్త్యస్తు సదాశివేశకరు ♦ ణామృతవర్ధిత రాజచంద్రమా!

ఋ॥ నే॥ ప్రభూ! భగవానుఁడు కరుణామయుఁడనుట కింతకన్న నిదర్శన
మింకేమివలయు? నాకనులయెదుటనే నీజీవిత మొకయింద్రజాల
మువలెఁ గడచినది. తిరిగి హితము వచించిన నాకు దేశబంధుపరి
త్యాగము సంప్రాప్తమయ్యె. నాటఁగోలె నానా దేశతీర్థయాత్రలఁ బ్ర
శాంతమనస్కుఁడనై యుండి యీశుభవార్త కర్ణాకర్ణిగ నాలించి
మిముఁ గాంచ వచ్చితి. ధన్యుఁడనైతి.

వజ్ర॥ జయసేనా! పూర్వస్మృతిం దెచ్చి నాయీమహానందము నేల విచ్చే
దింతువు? కష్టసుఖము లెవ్వరికిని శాశ్వతములు గావుకదా? ఎప్పటి
యట్లు మారాజవంశక్షేమ మఱయుచు, సచివుఁడవై యుండుము.

ఋ॥ నే॥ దేవా! క్షమింపుఁడు. తిరస్కారదోష మాపాదింపకుఁడు.

శా॥ దేవా! వార్ధకమబ్బె ధైర్య మెడలెన్ ♦ ధీశక్తిఁ గోల్పోతి న
ర్వావస్థల్ ఘటియిల్లె శౌర్యబలద - ర్పాదుల్ కృశించెన్ భవ

త్యేషల్ జేయఁగ వక్త్రి చాలదీక నా • దేవాదిదేవుఁ శివున్
దాసంబందున నిల్పి జీవపయముగా • బాయంగ నూహించితిన్.

భవా॥ మహాత్మా! మిమ్ము బాధింపవలయునని కాదు వృద్ధులయుపదేశము వృద్ధిప్రదమగునని మాయుష్మలిక, పోనిండు! చిరమిత్రుండగు సునయుం డమాత్యుఁడగు. ఎడనెడ మీసాయము పేక్షింతును. ఏకోలం లేక నివ్వీటనే గాలముఁ బుచ్చుచుండుడు. గురుదేవా: ఋషభయోగీంద్రా! భవదనుగ్రహమే యింతకును గారణంబుకావున, యీరాజ్యమే మీయది. నిరంతరభవద్దర్శనభాగ్యంబున మము ధన్యులఁ జేయవేడెద.

ఋష॥ (నవ్వుచు) కుమారా! సర్వ మెఱింగియు నిట్లు కోరఁదగునా? సర్వసంగపరిత్యాగులమై సర్వేశ్వరపదం బందనెంచు మాకు మరల నీ సంసారలంపటత యేల కల్పించెదవు. అట్లు కాదు. అపుడపుడు వచ్చి భవత్కుశల మారయుచుండెదను.

భద్రా॥ తండ్రీ! పద్మాకరా! కష్టకాలమున మమ్మాదరించి పోషించిన నీఋణ మిసుమంతయుఁ దీర్పఁజాలము. సకుటుంబముగ నీపురంబుననే కాపురముండి నను ధన్యునిఁ జేయఁగోరెద.

పద్మా॥ కుమారా: నీచిత్త మెట్లో యట్లే యగుఁగాక. సునయుఁ డిటనుండ, నట మేముమాత్ర మేమి చేయఁగలము.

భద్రా॥ సునయా! వినయసముల్లసితనయా! నేఁటినుండి నేను రాజును. నీవు మంత్రివి. ఇంక బాల్యవికారంబుల మాని ధర్మపరిపాలనాబద్ధకంకణులమై పెద్దలచే మన్ననలఁ బడయ యత్నించెదముగాక.

సున॥ ప్రభూ! గుణసాగరుఁడవగు నీయట్టియేకిమీనిం బొంది రాష్ట్రప్రజలు ను నేమును ధన్యులమైతిమి. ధర్మపూర్ణములగు నీయాజ్ఞలఁ బాలించెదగాక. రాజా! మఱచితిమి. అస్త్రవిద్యాగురుల నభినందనసత్కారములఁ దనుపవలదా?

భదా॥ (నవ్వుచు) పిచ్చివాఁడా! మునీశ్వరులు నాయీయుపదేశములనే వారికి సమర్పణంబొనర్చితిఁగాన నాయీభాగ్యభోగ్యంబులన్నియు వారివి కావా? వారిచ్చటనే వసించుచు మనల రక్షింపుచుందురు. తదాజ్ఞా బలంబున మనము కృతార్థులము గాఁగలము.

వం॥ శ॥ చిరంజీవులారా! మీయట్టిశిష్యరత్నములఁ బొందిన మేమునుఁడు ధన్యతముఁడు గాకుండు? నిరంతరనిరామయులై తేజరిల్లెదరుగాక.

వజ్రి॥ కుమారా! దైవానుగ్రహంబునను, గురుదేవుని యాశీర్వాదబలంబునను నావలనఁ గలిగిన యిడుమలఁ గడచి గద్దె నెక్కితివి. నీ విపుడీసమస్తమునకుఁ బ్రభుఁడవు: కావున:

ఉ॥ దోసపుబుద్ధి నూని కడు ♦ దుర్మతులౌచు విషప్రయోగమున్
జేసియు మత్సతీసుతుల ♦ జీవములన్ హరియింపనెంచు వి
ధ్వంసకశక్తులన్ సవతి ♦ తల్లుల శిక్ష యొనర్చి ధర్మవి
శ్వాసయుతుండవై సకల ♦ సౌఖ్యయశంబులఁ గాంచు మింకఁబన్.

అంతియే కాదు.

ఆ॥ వె॥ ముసలివాఁడనయ్యు ♦ ముదితలవలఁ జిక్కి
చెడుగుమాటవెల్ల ♦ చెవిని జేర్చి
కన్నకొడుకుతోడ ♦ గొంతను వని కంపి
నట్టినాకుఁ గూడ ♦ నాజ్ఞ నేయు.

ఉ॥ కానిమ్ము! ఊరక యట్లు చూచెదవేమి? భవదీయరాజనీతిప్రచాలనమున కిదియే ప్రథమపరీక్షావిషయము.

భదా॥ (తలవంచి మిన్నకుండును.)

ఋష॥ (స్వగతమున) ఆహా! భద్రాయువున కిదినిజముగఁ బరీక్షావిషయమే! (ప్రకాశముగ) ఏమిసమాధాన మొసంగునో చూచెదముగాక.

భదా॥ (తలయెత్తి) తండ్రీ! తొలుఁదొల్తనే యిట్టివిషమపరీక్షకుఁ బాల్పడ నేయ న్యాయమా? ఐనను నాయెఱింగినది వచించెద.

తే॥ గీ॥ ఇంపు కష్టముల గరవాన్న • మెఱకయున్న
నయ్య! నిప్పు మంటు వనుల • కంపకున్న
ఇంతకష్ట మెట్లు సమకూర్చు • నెవ్వఁడైన
బ్రహ్మమైనను నిలకవి • బ్రహ్మమైన.

అదియునుగాక, జనకా. బాధితులమగు నాకుఁగాని నాజననికిఁగాని, వారలపైఁగాని నీ పైఁగాని మాత్సర్య మిసుమంతయు లేదు మీవలననే నా కీర్తిప్రజ్ఞాయశంబులును, గురుదేవానుగ్రహంబును సంప్రాప్తమైనవని సంతసించుచున్నాఁడను. ఐనను (ఋషభయోగివంకఁ జూచి నవ్వుచు) గురుదేవులయెదుటనా మనధర్మసిద్ధాంతములు?

ఋష॥ (నవ్వుచు) మేలు! వత్సా మేలు సమస్తశాస్త్రపారంగతుఁడవు. నీకు దెలియరాని విశేషంబు లెయ్యవి? (వజ్రబాహువుతో) రాజా! పశ్చాత్తాపమే పాపపరిహారము. నిండుపేరోలగంబున నిక్కము వచించి పశ్చాత్తప్తుఁడవైతివి. చాలు. ఇంక నీ కెందును శిక్ష లేదు. మఱియును

ఆ॥ వె॥ తప్పిదం బదెంత • గొప్పదైననుఁగాని
జ్ఞానసూన్యులైన • నాతు లసుట
మమతఁ జూపి వారి • క్షమియించు టొప్పదే
రాజనీతి మీర • రానిదైన.

వజ్రి॥ మహాత్మా! మా యీ యానందాంతనాటకమునకు సూత్రధారివై నటియింపఁజేసి రక్షించితివి. మాచిరంజీవికి భద్రాయువు నొసంగుటయు నిషధబంధుత్వమునఁ గీర్తిమాలినిని సమకూర్చుటయు, భవదుదారకరుణామృతసంకల్పవిశేషమే కదా.

తే॥ గీ॥ కష్టములు మానవాళికిఁ • గలుగునట్లు
నట్టె సుఖములు గలుగును • నవనియందు
కాన కష్టసుఖంబుల • కరణి దెలియ
నీశ్వరవిలాసమని నమ్ము • మెపుడు రాజ.

(భద్రాయువుతో) కుమారా! ఈశ్వరవిలాస మతివిచిత్రమైనది. అది యెల్లపుడును మాయాదేవి ననుసరించి యుండును. భక్తత్రాణపరాయణుఁడగు పరమేశ్వరుఁడు పరీక్షాసమయములఁ గర్కశత్వ మవలంబించి హృదయభేదన మొనర్చుచుండును. అట్టియెడ ధీరుఁడై నిల్చినవానికే నిస్తులయశో విభూతిని సాయుజ్య మొసంగును.

తే॥ గీ॥ ఎట్టికష్టంబు కలిగిన • నెన్నఁడైన
విమలసత్యవ్రతంబును • విడువకున్నఁ
గామితార్థంబు లభియించు • నామహేశు
కరుణ విరతంబుఁ గలుగు ని • క్కముగ రాజ!

భద్రా॥ దేవా! ఇహపరానందకందంబగు సత్యవ్రతమాహాత్మ్యము తమకటాక్షమున నెఱుంగఁ గలిగితి. ధన్యోస్మి (నమస్కరించును)

ఋష॥ (లేచి) రాజా! ఇంక నేఁ బోయివచ్చెద. సుఖం బుండుము.

భద్రా॥ దేవా! శీఘ్రమే మరల భవద్దర్శనభాగ్యం బొసంగ వేడెద.

ఋష॥ పరమేశ్వరానుగ్రహప్రాప్తిరస్తు.

(అందఱు నిష్క్రమింతురు)

తెరవాలును

## పంచమరంగము

(ఉద్యానవనమున వసంతగీతమును బాడుచు నొండొరుల భుజములపైఁ జేతులు వైచుకొని భద్రాయువు కీర్తిమాలిని ప్రవేశింతురు)

భద్రా॥ ప్రేయసీ! మాధవాలింగనోత్సాహమున వనరమాదేవి యెంత యలరారుచున్నదో చూచితివా?

కీర్తి॥ (నవ్వుచు) ప్రియా! ప్రియతమాలింగనము సహజానందకరము గాదా?

భద్రా॥ అదిగో! అలతాపితానము నిజపుష్పగుచ్ఛభరంబుచే నాతరుణతరు శాఖల నెట్లు వంచుచున్నదో! చూడుము.

కీర్తి॥ ఆర్యపుత్రా! ఎంత వంచినను బాదప మించుకయుఁ జలించుట లేదు కదా. కావుననే లతాంగు లబలలు, పరాశ్రయజీవితలు నని పురుషు లందురు.

భద్రా॥ అదిగో! అప్పుడే కోపము వచ్చినదా! ప్రకృతిసహజధర్మమును వర్ణించు నామాటలయందు నర్మగర్భితభ్రాంతి నీ కేల కలిగె?

కీర్తి॥ నేనుమాత్ర మే మంటిని? పురుషులు మాయకులు, స్వార్థపరులునని సహజప్రకృతినే యనువదించితిని కాదా?

భద్రా॥ (నవ్వుచు) పిచ్చిదానా! మిగులఁ బొరఁబడుచుంటివి. మాయకు స్త్రీ పరత్వముకాని, పురుషపరత్వము లేదు. మాయికయగు కాంతాపతి మాయకుఁడగునేమో చెప్పఁజాలను.

కీర్తి॥ నాథా! మీవిజ్ఞత నంతయుఁ జూపి నన్నేల పరిహసించెదరు? అబ్బా! పురుషులయెదుటఁ దరుణులు నోరెత్తుటకు భయముకదా: ఏదియో మిషపెట్టి స్త్రీల వంచించుటయే పురుషస్వభావమై పోయినది. (కోపముతో) సమస్తజగదాధారభూతయగు పరాశక్తిప్రభావమే సృష్టిస్థితిలయకారణభూతంబని యెఱింగినవారు స్త్రీజాతి నెప్పుడు నదిక్షేపింపరు.

భద్రా॥ (వికటముగ నవ్వుచు) ఓహో! అదియా నీయహంభావము? పరమేశ్వరునిచే వంచింపఁబడిన పరమేశ్వరి ఘోరతపశ్చర్యలవలన భగభగవానుని వశంవదు నొనర్చికొని యర్థశరీరప్రాప్తిఁ జెంది సృష్టిస్థితిలయకారకురా లయ్యె. అంతియెకాని పురుష రహితంబగుశక్తి జగత్కారణమనుట హాస్యాస్పదము గాదా? ఐనను వినుఁబోలు నెఱజాణ లందరు పరశక్తిస్వరూపులనియా నీభావము?.

కీర్తి॥ పోనిండు. నాథా! ఇపు డాయపరిస్థితపరిశీలన యేల? మనావహ మగు పరిమదావన విహారమునయందిపుడు దీర్చికొందము. రండు.

భద్రా॥ దేవీ: పరతత్వవిచార మెప్పుడును నప్రస్తుతము గాఁజాలదు. మానవజీవితపరమావధియే యద్దాది.

చం॥ నిరతము మానవావళికి • నిశ్చలచిత్తమునన్ బరేశునిన్
గరము భజించుటే నిజము • గాఁ దగుకార్యముగాని మూఢత<
దరుణులఁగూడి రమ్యప్రమ • దావనకేళివిహారసౌఖ్యముల్
స్థిరమొకొ చేయు దివ్యపథ • దీపిక లయ్యవి యౌనె మానినీ!.

కీర్తి॥ నాథా! పరమార్థధర్మనిర్ణేత లందఱును సంసారవనసౌరభానుభవులే సుమా! పరమార్ధవిచారముసంసారమునఁగాక సాగరమునరా?

భద్రా॥ ఓహో! నీవిమర్శన మేవధి నతిక్రమించుచున్నదే? కానిమ్ము! మున్ముందుఁగాని నీకుఁ బరమార్థతత్త్వము విదితముగాఁజాలదు (ప్రక్కకుఁ జూచి) అదిగో! భ్రమరయోధము లాపుష్పగుచ్ఛముల నెట్లు బాధించుచున్నవో చూడుము?

కీర్తి॥ (నవ్వుచు) నాథా! మధుపానమత్తతచే నామిళిందము లట్లాగడము నేయుచున్నవి. కాని—ఫలసృష్టి కీకీటకములు సైతము కొంతకారణము గాదా?

భద్రా॥ ఔను! అనిర్వాచ్యపరిభావుఁడగు భగవానునిలీల లాశ్చర్యజనకములుగదా!

కీర్తి॥ ప్రియా! ఆసరోవరతీరమునఁ గొంతవిశ్రమించి పోవుదమా?

భద్రా॥ పోవుదము రమ్ము. ఇంకను సాంధ్యారుణదీధితులతోఁ బ్రభాకరుఁడు భాసిల్లుచునే యున్నవాఁడు (ముందుకు నడచెదరు) ఓహో! ఏమి యీకమలాకరమువొలుపు! రమావాసభాసురంబులగు నీకమలము లెంత మనోహరముగ నున్నవి! దేవీ! రమ్ము. అల్లదే యాతరుమూలవితర్దిపైఁ గొంతతడవు విశ్రమించి వనలక్ష్మికి జోహారు లర్పింతము. [చెట్టుమొదటఁ గలయరుగుపైఁ గూర్చుందురు. హా

# పంచమాంకము

కీ॥ హాయి! వివిధకుసుమసౌరభవాహకశీతలసు. సీమంతమంతయూ
నిజం బెంతయు స్తుతిపాత్రుఁడుకదా?

చం॥ లలితలతావితానములు • రమ్యమనోజ్ఞమహీరుహంబులున్
మలయసమీరముల్ వికచ • మంజులపల్లవపుష్పగుచ్ఛముల్
కలకలనాదశోభితఖ • కపక్షికరంబును గానకోకిలల్
తెలియఁగఁ జేయునీశ్వరుని • దివ్యమహామహిమంబు లిమ్మేడన్

కీర్తి॥ దేవా! దివాకరుం డపరగిరిశిఖరంబారోహించుచున్నాఁడు శకుంతసంతానము లెల్ల గూడుకొని కులాయములఁ జేరుచున్నయవి. ఆహా! ఎల్లకై నోళ్లు తెఱచికొని యాశకుంతశాబకము లెట్లార్భాటము సేయుచున్నవో చూడుడు!

ఆ॥వె॥ ప్రేమమయము చూడ • విపినజీవితమైనఁ
బ్రేమసర్వసమము • క్షేమకరము
ప్రేమలేని జీవి • పృథివిఁ బుట్టఁగ నేల?
ప్రేమకలనఁ గాదె • విశ్వసృష్టి

(వృద్ధ సేవకుఁడు ప్రవేశించి నమస్కరించును)

భద్రా॥ ఏమి! ఇట్లు వచ్చితివి? విశేషము లేమైనఁ గలవా?

సేవ॥ బాబూ! అడివిరాజ్యంలో మృగాలబాధ యెక్కువైందఁట చెంచులు చాలామం దొచ్చి కోటలో గోలపెడుతున్నారు. మంత్రిబాబుగారు మీతో చెప్పి రమ్మన్నారు.

భద్రా॥ సరియే! మేమును బయలుదేరుచున్నాము నీవు పద.

సేవకుఁడు నిష్క్రమించును)

(కీర్తిమాలిని చేయిఁ బట్టుకొని) దేవీ! మహామంత్రులు నాకై నిరీక్షించుచుందురు. చీకటి పడకమునుపే మనము నగరుఁజేరుట మంచిది. పోదము రమ్మ.

కీర్తి॥ ఏమి! ఈతొందర? ఇపు డాచెంచు లెక్కడికి పోవుదురు?

భద్రా॥ అట్లు కాదు. వెంటనే వెళ్లి యాఖేటకోచితసన్నాహంబు లొనర్పవలయు. వేకువనే పయనమూఁ గావలయు. బయలుదేరుము.

కీర్తి॥ [వినుగతో] హింసాకరంబగు వేటకు మీరు సైతముఁ బోవలయునా? సేనాపతులును, సైన్యమును బోవుచురుకదా? ఇంక మీ రేల?

భద్రా॥ దేవీ! మృగయావినోదము క్షత్రియోచితము గాదా? ఇచ్చటకన్న నచ్చటిప్రకృతిరామణీయకము మహాద్భుతము. చూచి తీరవలయు?

కీర్తి॥ ప్రియా? అటులైన నేను వచ్చెదను. ఆ యావినోదంబులఁ గాంచి నేనును సంతసించెదను.

భద్రా॥ (నవ్వుచు) ఓహో! నీవును ఎత్తువా? ఉద్యానవనవిహార మనుకొంటివి కాఁబోలు. అచ్చటిదృశ్యంబు లెట్లుండునో చెప్పెద వినుము.

సీ॥ కారుచీకటి క్రమ్మి ♦ కడుభయంబును గొల్పు
దుర్గమైనట్టి ♦ మార్గచయము
బండి పోవుటకై ♦ నిండుమార్గము లేక
దారి కడము వచ్చు ♦ దండిపొదలు
అలికిడి యైనంత ♦ నటునిటు దొరలుచు
పడగగెత్తుచు నాగు ♦ బాములొసమి
భయము చేఁ బఱచుచు ♦ బైఁబడ నుంకించు
వ్యాఘ్ర భల్లుక సింహ ♦ వారణములు

తే॥ గీ॥ కలిగి కడుభయానకమైన ♦ కానసుమ్ము
సఖులతోఁగూడి విహరింపఁ జాలునట్టి
రమ్యకుసుమితకేళికా ♦ రామ మనుచు
మదిఁ దలంచితివేమొ ప్ర ♦ మాద మబల!.

కీర్తి॥ నాథా! ఇచ్చటికన్న నచ్చటిప్రకృతిరామణీయకము చూచి తీరవల నని యింతకుమున్నేకదా! వచించితిరి? మఱల నీపిరికిరన మేల పోనెదరు? నేనును వీరక్షత్రియవంశసంజాతనే! వింట బాణము. దొడుగ నేర్చినదాననే!—సంశయింపక నాముద్దు చెల్లింపుఁడుఁ (బ్రతిమాలును)

భద్రా॥ అమ్మా! తెలియు చపలాపవిధము తెలియంగక పుత్రఫల సాధింతువు [ఆలోచించి] కరేః కానిమ్ము నీకోర్కె కాదననేల? ఒకసారి చూచి వచ్చెదరని వట్టికోరిక విన్నటికి గోరఁజాలవు. ఇంకఁ బోవు ఏమి రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

తెర వ్రాలును

## షష్ఠమరంగము

(అరణ్యప్రదేశమునం దొక చెట్టునీడను కీర్తిసేన విశ్రాంతి నొందుచుండును)

కీర్తి॥ ఓహో! ఏమి యీగహనవిలాసము.

తే॥ గీ॥ వివిధతరులతాకీర్ణంబు • విస్తృతంబు
నఖిలనీరోత్పలంబుల • కాటపట్టు
పరిణతమధురకమనీయ • ఫలయుతంబు
ప్రకృతిరమణీయ స్పృహణీయ • భావతతము.

(తెరలోన భయంకరధ్వనులు, కోలాహలము)

అమ్మా! భయంకరనిర్ఘాతారావంబులతోఁ జెవులు బ్రద్దలగుచున్నవి.

తే॥ గీ॥ భయద మృగ సర్ప కంటక • మయముగాక
యున్న, నీవనగరిమంబు • నెన్నఁ దరమె
మంచిచెడుగుల నొక్కెడ • నెంచి కూర్చు
నీశ్వరవిలాస మతిచిత్ర • మింపుఁ గనగ.

అయ్యో! నానాథుఁ డింకను రాకుండెనే! హింసాకరంబగు వేటవల దని యెంతచెప్పినను వినలేదుకదా! (ప్రక్కకుఁ జూచి సంతసమున) ఆ! అదిగో వచ్చుచున్నారు! (భద్రాయువు ప్రవేశింప నెదురేగి కౌగలించి)

నాథా మిమ్ముల నలసినట్లున్నారు. ఒంటరిగా వచ్చితిరేల? మృగయా సంపఱు నేమైరి? వేట పూర్తియైనదా? కొంచెము సేపు విశ్రమింపుఁడు.

(ఇరువురు కూర్చుండెదరు)

భద్రా॥ (శ్రమ నభినయించుచు) వేట పూర్తియైనది. పరివారమంతయు మృగములఁ గొనుచుఁ గదలిపోయిరి మనము కొంచెముతడవిట విశ్రాంతిఁ దీసికొనునంతలో వారును రాఁగలరు. ఆ! పరికాని అరణ్యదృశ్యములు—ఎట్లున్నవి?— విహారయోగ్యముగ నున్నవా?

కీర్తి॥ దేవా! ఎన్నఁడును జూడనిదాన నగుట నట్లు కోరితిఁగాని—హృదయ విదారకదృశ్యంబగు నీకాననంబున మాబోంట్లకుఁ గావలసిన దెద్దియు లేదు.

భద్రా॥ సరికదా! నేను మున్నే చెప్పియుండలేదా? ఇంక నెన్నఁ డిట్లు కోరవుకదా!

కీర్తి॥ నాథా! దాపరికమేల? మిమ్ము విడచి యుండలేక యిట్లుకోరితినిగాని వనదృశ్యములపై భ్రాంతిచేఁ గాదు.

భద్రా॥ (నవ్వుచు) పిచ్చిదానా! నిరంతరము మన మిట్లు కలసి తిరుగుచున్నచోఁ బ్రజలును బరివారమును గేలిసేయుదురు కామాంధులమని తూలనాడుదురు. వారు—న న్నేలికగా నంగీకరించినది ప్రజాసౌఖ్యపరిపాలనకుఁగాని భార్యాపరిరంభణోద్యోగమునకుఁ గాదు.

కీర్తి॥ [నవ్వుచు] నాథా! ప్రజలకొఱకు నన్ను దిరస్కరింతురా? నేనును మీప్రజలలో నొకదాననేకదా! నాకోరికమాత్ర మేల రిత్తవోవలయు?

భద్రా॥ తిరస్కరించుటయే కాదు! ధర్మభంగసంశయమున నవసరమైనచో వదలివేయుటకుసైతము వెనుకాడను.

కీర్తి॥ (భయాశ్చర్యములతో) ఆ! అదేమి నాథా! అట్లంటిరి? [చెవులు మూసికొని) శివ, శివా! అమంగళము శాంతించుఁగాక—ప్రియా! ఏలనో మీ రట్లనినదిమొదలు నామానసము కంపించుచున్నది.

భద్రా॥ ఇవిలా! నవ్వులాటకనినమాటలను జాపి సేయుచుంటివా! ఒకవేళ నట్టిసంఘటన మే దైనఁ బొసగిన నీభవార్రియము జీవములతో నుండఁగలఁడా?

కీర్తి॥ (దుఃఖమూనమునముఖము జేతులతోఁ గప్పుకొని) నాథా! ఏలనో కేంరీనా వన్నియు నమంగళములే నుడువుచున్నావు హా! పరమేశ్వరా! ఏమి సంకల్పించితివో కదా! దీనావనా! పాహి! పాహి!

భద్రా॥ (వికటముగ నవ్వుచు) వెఱ్ఱిదానా! నామాటలకేనా! ఇంత భయము?

ఆ॥వె॥ అనినమాట లెల్ల ♦ ననినట్లు జరిగిన
మానవుండు జగతి ♦ దీనుఁ డగునె
కోరినట్లె యన్ని ♦ కోరిక లీడేర
జగతి స్వర్గతుల్య ♦ మగును గాదె

అదియుగుఁగాక సర్వమంగళానాథుండగు సర్వజ్ఞుఁడు సంరక్షకుఁడైయుండ మన కమంగళము లేల ప్రాప్తించవలయు?

కీర్తి॥ దేవా! మీ రనినమాటల కట్లంటినిగాని సర్వమంగళాదేవి యనుగ్రహమున్న నన్నియు మంగళములే యగును గాదా?

భద్రా॥ దేవీ! ఏమిది! ఇంకను మృగయులు వచ్చుజాడ కన్పించుటలేదు. మరల నేను బోయి వారలఁ దోడ్కొని వచ్చెదను. శిబిరమున కేగి విశ్రమింపుము.

కీర్తి॥ వలదు. నాథా! వలదు. వారలును వచ్చుచుందురు. ఇంక మీయెడఁబాటు సహింపఁజాలను. క్షమింపుఁడు (నమస్కరించును)

(తెరలో భయంకరగర్జనము: వెంట నే యొక బ్రాహ్మణుఁడు పరుగిడి వచ్చును)

బ్రాహ్మ॥ రాజా! రాజా! అయ్యయ్యో, నాభార్యను పెద్దపులి పట్టినది. అయ్యో! అట్లు చూచెదవేమి? దుష్టశిక్షణ శిష్టరక్షణ దక్షుండవు. మహారాజా! ఆలసింపకుము. ఊఁ! పరుగెత్తుము — అదిగో దాపుననే యున్నది. త్వరపడుము. సతీభిక్ష నొసంగి సంతసముఁ జూపుము.

భద్రా॥ (పిల్లి నమ్ము లందికొని) భూదేవా! భయము వలదు. క్షణములో నా వ్యాఘ్రమును సంహరించి మీసతిని దెచ్చెదను. (భార్యతో) ప్రియా ఇచ్చటనే యుండుము. భయము వలదు ఇప్పుడే వచ్చెదను.

(భద్రాయువు పరుగెత్తుచు లోనికిబోవును. కీర్తిమాలిని యాతనిపునకే దైన్యముగఁ జూచుచుండును. బ్రాహ్మణుండు జపమాల ద్రిప్పుచుండును)

కీర్తి॥ (స్వగతముగ) అయ్యో! ఈబ్రాహ్మణు డెవ్వరు? ఈ విపరీతసంఘటన మేమి? ఓనయామయా! జగదీశ్వరీ! నాపతి, కేయాపదయుఁ గలుగనీయక నాయెడఁ జేర్పుము. జననీ! మముఁ గాపాడుము. [కండ్లు మూసికొని ధ్యానించును.)

భద్రా॥ (ప్రవేశించి విన్నఁదనముతో] మహాత్మా: పాహి మాం! చూచుచుండగనే పులియు సతియు నదృశ్యులైరి ఎంత వెదకినను గనుపింపలేదు. ఇంద్రజాలమువలె నున్నది. (నమస్కరించి) మాటఁ జెల్లింపఁజాలని యీ వ్యర్థుని మన్నింపుఁడు.

బ్రాహ్మ॥ (కనులు దెఱచి కోపముతో) ఛీ! ఛీ! క్షత్రియకులకళంకా! ఒకవ్యాఘ్రమునుఁ జంపి బ్రాహ్మణిని రక్షింపఁ జాలని నీశౌర్యము కాల్పనా? ఆర్తత్రాణపరాయణంబగు దాశార్ణరాజవంశంబునఁబుట్టి చేఁజేత, కానిపని యొనర్చి పైగా వ్యర్థుఁద ననుచున్నాఁడవా?

మ॥ గురువుల్ నేర్పిన మంత్రతంత్రవిలస ♦ త్కోదండపాండిత్యముల్
పరఖడ్గంబు సహస్రనాగబలమున్ ♦ వర్మప్రభావంబులన్
దురితాత్మా! యెట కేగె శౌర్యబలముల్ ♦ దోర్దర్ప మేమాయె ని
ష్కారుణన్ వ్యాఘ్రమువాత బెట్టితివె నా కాంతామణిన్ మూఢుఁడా!

(శోకము నభినయించి) హా! సతీమణీ! సతీమణీ! నీవు లేని నాకీజన్మ మేల? అయ్యో! యజ్ఞాదుల నపత్నీకుఁడనై యె ట్లాచరింతు. అమెతలిదండ్రుల కేమి సమాధానము. ఆయ్యయో! దారను దారిలోఁ బులివాత బెట్టి వచ్చితినని యెంతమంది పరిహసింతురోకదా! బ్రహ్మచర్యమున నెట్లు దినములు గడుపుదును. హా! విధీ! ఇంతలో నిట్లు చేసితివా?

భద్రా॥ (బ్రాహ్మణుని సమీపించి) మహాత్మా! ఏల శోకించెదవు? సర్వము
మాయామయంబనియు, తనువు లనిత్యములనియు, శివసాయు
జ్యమే నిత్యమనియు మిముఁబోలు మహాత్ములు వచింతురుకదా?
తమకేవిధముగ బంధము పొలఁగినది. ఇంకఁ బరమేశ్వరధ్యానం
బునఁ బరమార్థము నొందఁ బ్రయత్నింపుఁడు.

బ్రాహ్మ॥ ఓయీ! ఈపాటివేదాంతము మాకును దెలియును.

ఆ॥ వె॥ ఒరుల ననునయించు • తెరవి వేదాంతంబు
లుప్పతిల్లు కుప్ప • తిప్పలుగను
తట్టిచింతఁ దాను • ననుభవించెమునెడఁ
దలఁపఁ డౌర యెట్టి • ధర్మములను.

అస్మత్ప్రతిజ్ఞాధురీణా! ఇంక నీవు పురంబునకేగి భార్యతో సుఖంబుం
డుము. నేనీయరణ్యముననే భార్యావియోగదుఃఖపరితప్తుఁడనై కృశించుచు
నేదవానలంబునకో యాహుతి నయ్యెద. పొమ్ము! రాజా పొమ్ము! ఆర్త
రక్షణపరాయణత పరమేశ్వరునియెడనే మృగమైన మానవుఁడవు నీవలన
నే మగును?

భద్రా॥ ఆర్యా! ఏల నిందించెదవు? మీ కుపకరింపఁజాలని యీతను వేల?
భాగ్యభోగ్యము లేల?

శా॥ దేవా! చింతిలనేల నయ్య యిదె నా • దేహంబొ! సామ్రాజ్యమో!
దేవీరత్నమొ! శైవవర్మమొ! మహో • ద్వేగంబుఁబోనాడి మీ
భావస్ఫూర్తిగఁ గోరుఁ డిచ్చెదను నా • పాపంబులన్ బాపగా
నీవే కర్తవటంచు నెంచితిని కా • నిమ్మింక విప్రోత్తమా.

బ్రాహ్మ॥ ఆ! మాటలకేమి లెమ్ము ఇంతకుమున్నేకదా యొకమా టొసగుట
యుఁ గాదనుటయు నైనది?

భద్రా॥ ఆర్యా! అట్లు కాదు. మనుష్యునకు పరమేశ్వరుని యాన. ఇందులకుఁ దప్పితినేని: రౌరవాదినరకప్రాప్తి యగుఁగాక. పంచభూతములు సాక్షిగా బ్రమాణ మొనర్చినాఁడ

బ్రాహ్మ॥ ఆ! ఆదీ! రాచపుట్టువునకు సార్థకత. రాకుమారా: నావాంఛిత మెఱింగింతు వినుము. — నీశరీరముచే నాకుఁ గావలసిన దేదియు లేదు. ఇంక సంసారలంపటతయె పరిదిద్దు కొనలేనివాఁడను. సామ్రాజ్యబంధనము నా కేల?—అపత్నీకుఁడ ననునపవాదమునకుఁ బాల్పడకుండ—నీభార్య నొసంగితివేని ధర్మపత్నిగ నంగీకరించి నీకీర్తిచంద్రికల వ్యాపింపఁజేసెద. నీపితృదేవతలఁ దరింపఁ జేసెద

భద్రా॥ (నవ్వుచు) ద్విజోత్తమా! పరిహసించుచుంటిరా? లేకున్న—వైదికధర్మపరతంత్రులరగు మీకేమి? పరమార్థదూరంబగు పరదారపరిగ్రహణము సేయుటేమి? పరిహాసమునకో: పరీక్షించుటకో! ఇట్లనియుందురు.

బ్రాహ్మ॥ రాజా! పరిహాసము కాదు; పరీక్షయుఁ గాదు. కోరుఁ డిచ్చెదనంటివి, కోరితిని ఇచ్చెదవా! ఇదియు లే దందువా?

భద్రా॥ బ్రాహ్మణోత్తమా విపరీతసంఘటన మొనర్చెదరా?

ఉ॥ కోరుఁ డటన్న కోయుదురె? ♦ కోమలినిం బరమార్థదూరులై
యారహి నెవ్వరైన మును ♦ నెచ్చటనైన నొసంగినారె? యౌ
రౌర యిదేటికోర్కె? పరి ♦ హాసముకై నను నాడ నొప్పునే?
సూరులు మెత్తురే? పడఁతి ♦ శోకమునన్ జరమత్వ మందదే?

బ్రాహ్మ॥ ఏమీ! నేను మున్నే చెప్పియుండలేదా? ఇంతటివాచాలుఁడవు, దుర్బలతచేతన్యుఁడవు. ఘోరప్రమాణం బేల చేసితివి?

శా॥ ఔరా యెంతటివంచనామతివో "యా ♦ ర్యా! కోరుఁడీ" యంచు వే
ధీరాలాపము లాడి కోరఁగనే సం ♦ దేహాభిమానంబులన్

సారావారత నెంచఁటివిర చాం • పల్యాంబులన్ నీ కేలి నా
దాఁటన్ బోయెద నీయలేననుము మి • ధ్యావాదచూడామణీ.

కీర్తి॥ (భర్తను సమీపించి) నాథా! దైవఘటన మేనాఁటి కెట్లుప్రాప్తించునో యెవరు చెప్పఁగలరు? ఈమహనీయునింబోలు మనుజమాత్రుఁడు గాఁ బోచుటలేదు. నాసౌశీల్యమునుఁ గాపాడుకొను టెఱవెఱుంగు దును. మీ రనినట్లు నన్నీద్విజన్మునకు దానం బొసఁచ్చి సత్యవాక్పరిపాలకులు కండు. అందుల కయ్యేకదా. మాతాత నలసార్వభౌముఁడు భార్యను గోల్పోయి యడవుల విడుమలువడి జగద్విఖ్యాత సౌఖ్యంబు లందె. (కండ్ల నీరు తుడిచికొనుచు) మన కీజన్మమున నింతియే సుఖము గాఁబోలు. నాచేసినసత్కృతపుణ్యపరిపాక మీతీరున ఫలించినది. (పైకిఁ జూచి) తల్లీ! మహేశ్వరీ!

చ॥ జనితదురంతపాపముల • శాంతియొనర్చియు నింతమీదటన్
జననము లేక నీదుపద • సారసయుగ్మము నెల్లకాలముఁ గా
గనుచు భజించు పుణ్యమిడఁ • గా వరదానము నేయుమమ్మ నా
మనమున నుండుమమ్మ యభి • మానముఁ గావగదమ్మ యీశ్వరీ!

భద్రా॥ దేవీ! మాటవరుస కనినదాని కీబ్రాహ్మణుఁ డింత పట్టుఁబట్టుచున్నాఁడు. ఇట్టిధర్మ మెచ్చటనైనఁ గలదా? ఎవరైన విన్న నగరా? కలదుకదా "శుక్రనీతి" యేమైన నగుఁగాక నిన్ను విడువఁజాల
[కౌగలించును]

కీర్తి॥ [దుఃఖమున] నాథా! నశ్వరములగు నీశరీరములపై భ్రాంతిఁజెంది పరమార్థదూరు లయ్యేదరా? విజ్ఞానధనులగు మీకు నేనుజెప్పునంతటిదాననా? నిర్మలమనస్కులను బరమేశ్వరుఁడు బాధింపఁ దలఁచునా? కావున నీమహనీయునియభిమతం బీడేర్చి చరితార్థులు కండు.

బ్రాహ్మ॥ రాజా! ఆతురాలివలన ధర్మ మెఱుంగ వలసెనా? భవిష్యత్ప్రపంచమునకు మార్గదర్శకుఁడ వగుచుంటివా? ఇంతయేల? చెప్పు నన రాదా! నేఁ బోయెద. అదియుఁగాక యీవిధముగ నేడ్చుచు నిచ్చినదానముఁ బరిగ్రహింపఁజాలను.

(బ్రాహ్మణుఁడు పోఁబోవును. భద్రాయు వడ్డువచ్చి నమస్కరించి)

భద్రా॥ మహాత్మా! తామసింపకుఁడు. దాంపత్యప్రేమ ప్రాపంచికధర్మం బగుట నింతగాఁ జింతింపవలసె. ఐహికసుఖవిరక్తుండనై మీయభీష్టం బీడేర్ప నెంచితి. దయనేయుఁడు.

బ్రాహ్మ॥ రాజా! సకలభూతములు సాక్షిగా జలధారాపూర్వకముగా నొసంగవలయు. తెలిసినదా?

భద్రా॥ చిత్తము! దేవీ! జలకలశము నిటుఁ దెమ్ము.

(కీర్తిమాలిని లోనికరిగి కలశముఁ గొని తేగా నందుకొని)

మ॥ పరమార్థంబు మదిం దలంచి పితృదే ♦ వధ్యానచిత్తుండనై
యరవిందోదరపద్మగర్భముఖు లా ♦ ర్యాదేవియుఁ సిద్ధులున్
సురలున్ సాక్షులుగా శివార్పణమటం ♦ చు న్నాదునిల్లాలినిన్
వరదానం బొనరించినాఁడ నిదె దే ♦ వా! గొమ్ము సంప్రీతిగా.

(బ్రాహ్మణుని చేసిట జలము విడచును.)

బ్రాహ్మ॥ రాజా! మహౌదార్యమండితమగు నీజీవితము ధన్యతమ మగుఁగాక. వంశవర్ధనుఁడవై యాచంద్రార్కయశోధనంబు లందెదవుగాక. ఇంక మేము పోయివచ్చెదము—రాణీ! రమ్ము కడుదూర మఱుగవలయునుమా!

కీర్తి॥ (భర్తకు ప్రదక్షిణ మొనర్చి నమస్కరించును.) నాథా! సెలవు.

బ్రాహ్మ॥ ఇంక నీవు నాదానవు. ఏమియు మాటాడఁగూడదు రమ్ము. (నడచును)

కీర్తి॥ చిత్తము! (మాటిమాటికి వెనుదిరిగి చూచుచుఁ బోవును)

భద్రా॥ [దైన్యముతో] వారు వెళ్ళినవైపునకే చూచుచు) హా! పరమే...
నేటి కీవిధముగ నాజీవితపరిణామమును గల్పించితివా?—(సఖే)
పిచ్చిబ్రాహ్మణుఁడు! కాకున్న వంశవర్ధనుఁడవు కమ్మని దీవించు
చునా? భార్యను దాను గొనిపోవుటయు—నేను వంశవర్ధనుఁడ
నగుటయునా? (ఆలోచించి) మఱల వివాహమాడుమనియా? ...
యనఘునియుద్దేశ్యము! వలదు. పునర్వివాహము వలదు. ...
ధవిముక్తుఁడనై భవ్యసాయుజ్యపదవి నందెదనుగాక. అ...
నే నియ్యెడ మేనుఁ బాసిన వృద్ధులగు మాతాపితరు లెంత ...
పిల్లుదురోకదా! పేటనుండి మఱలివచ్చి నన్నుగానక సేనాపతియు
మృగయులు నెంత చింతింతురోకదా! అయ్యో! క్షేమాలినీ! నన్ను
విడచి పోఁజాలక పదములు తడఁబడ మెల్లగ నడచుచు మాటిమా
టికి వెనుఁదిరిగి చూచుచు నశ్రుజలపరిపూర్ణంబులగు నయనంబు
ల నొత్తికొనుచు విధిలేక విప్రునివెంట నేగితివా? నీయట్టి...
నెన్నిజన్మాంతరములనైనఁ బడయఁగలనా? (...ంచుచు) ఛీ!
ఛీ! పరమపదదూరంబైన సంసారచింతన యేల? సదాశివచరణాబ్జ
స్మరణమున జీవములఁ బాసెద. ఇవుడీ ... బరిత్యజించు టె
ట్లు? (ఆలోచించి) ఆత్మహత్య మహాపాతకముకదా! దారుపాషాణ
ఘాతములు బాధాకరములేయగుఁగాని తనువిముక్తిఁ గలిగింపఁజా
లవు. నదీపాతము పవిత్రమే యైనను—ప్రాంతము గాదు. ఇంక
నియ్యెడ నగ్నిహోత్రుఁడే నాకు శరణ్యుఁడు (ప్రక్కకుఁ జూచి)
ఇదిగో! ఈయింధనములన్నియు నేరి, చితిఁబేర్చి హవ్యవాహను
నారోపించి కృతకృత్యుఁడ నయ్యెదఁగాక (నిష్క్రమించును)

(తెర యెత్తఁగా మండుచున్న చితిప్రక్కను భద్రాయువు నమస్కరించుచు)

భద్రా॥ దేవా! హుతాశనా! పాహిమాం! పాహి మాం!

ఉ॥ దేవుఁడ వీవు దేవతల ♦ దీనదయాపర! నీవుగాక నన్
గావఁగ నేరు లేరిపటఁ ♦ గావున నీవె శరణ్యమయ్య నా
జీవము లామహేశుపద ♦ సీమను జేర్పఁగదయ్య సర్వలో
కావనదక్ష! నాతనువు ♦ నాహుతిగాఁ గొని హవ్యవాహనా?

(అగ్నిలోఁ బడఁబోవును. అగ్ని చల్లారును. అగ్నిమధ్యమందుండి పార్వతీపరమేశ్వరులు కీర్తిమాలిని హస్తము నిడుకొని సాక్షాత్కరింతురు. భద్రాయువు ఆనందాశ్రువుల రాల్చుచు తన్మయుఁ డగును.)

భద్రా॥ (కండ్లు తెఱచి నమస్కరించి) జయమహాదేవ! జనకా! పార్వతీశ్వరా! పాహి మాం! పాహి.

పర॥ భక్తప్రవరా! ధన్యతమజీవివి. రాజయోగివగు నీచరితము చిరతరస్థాయి యగుఁగాక. భవదీయధర్మదీక్షను బరీక్షింపనెంచి యప్రియాపంబున వచ్చితి. ఈనాపతియే యాబ్రాహ్మణి. మాయాదేవియే వ్యాఘ్రము సత్యసంధుఁడవై నీపితృదేవతలఁ దరింపఁ జేసితివి. ఇదిగో! నీభార్య కీర్తిమాలిని. మరల నీమెనుఁ బరిగ్రహించి కళ్యాణప్రదంబుగ నవనిఁ బాలింపుము. ఇంక నీకష్టములన్నియుఁ గడచినవి. ఎంతటివానికిని బ్రారబ్ధము దుర్లంఘ్యము. కావున నను భవించిన సిలుగులఁ దలంచి చింతింపక ప్రేమానందమయుడవై యశోనిధులు కండు.

( కీర్తిమాలిని భద్రాయువు పాదములకును పార్వతీశ్వరులకును మ్రొక్కును. )

భద్రా॥ తండ్రీ! కైలాసపతీ! పురాణదంపతులగు మీదర్శనభాగ్యము లభించినది. ధన్యోస్మి. మానవదుర్లభంబగు భవత్సాక్షాత్కారభాగ్యము

గలిగియు భవబంధవిముక్తి నందఁజాలని నేను ధన్యతముండనె
ట్లగుదును? దేవా! ఇంక నాకీయిహసౌఖ్యములపై భ్రాంతిలేదు.

ఉ॥ ఈయిహసౌఖ్యముల్ కనగ • హీనములంతవిపత్ప్రయుక్తముల్
హేయనికృష్టక్లేశదము • లింక సహింపగ నోప దేవ! నా
శ్రేయము నెంచి నీదుపద • చింతనమే నిరతంబుగాఁగనా
ప్యాయన మొప్పఁ జేర్చఁగదె • ధన్యపదంబు మహేశ! ఈశ్వరా!

పర॥ వత్సా! వినుము. భవత్పరిపాలనాధురంధరత్వమున నీవసుంధరపది
వేలవత్సరములు సుఖింప వలసియున్నది. కావున నీ కీభూలోక
వాసము తప్పదు. పిదప మత్సాన్నిధ్యమున నెట్టిసుఖంబు లభిం
చునో యట్టి సుఖంబునొంది పిమ్మట మత్సాయుజ్యము నందెదవు.

కీర్తి॥ జననీ! సర్వమంగళా! సచ్చిదానందరూపులగు మీసందర్శనంబున
మాజీవితములు సార్థకములైనవి. నిరంతరభవద్వ్రతాచరణపరాయ
ణులగు నాతలిదండ్రులకును ముక్తి నొసంగ వేడెద.

పార్వ॥ కీర్తిమాలినీ! సార్థకనామధేయవై ఈశ్వరాజ్ఞానువర్తినివై పదివేల
వత్సరములు జీవించి సత్సంతానసౌభాగ్యవతివై యంతమున నాస
న్నిధి చేరెదవుగాక.

కీర్తి॥ మహాదేవీ! పుత్రహీనులగు నాతలిదండ్రులఁ గరుణించి వారలకు
సత్పుత్రుల నొసంగ వేడెద.

పార్వ॥ (నవ్వుచు) పూర్వమె నొసంగితి. చాలునా? నీకుఁ దమ్ములు?
కీర్తి॥ (నవ్వుచు) జగన్మాతా! నీదయయున్న నంతియె చాలు
భద్రా॥ పరమేశ్వరా! ఇంకొక్క మనవి. మదీయజననీజనకులకును, మిత్రుఁ
డగు సునయునకును తజ్జననీజనకులకును ముక్తినొసంగ వేడెద.

వర॥ కుమారా: ఆట్లే యగుఁగాక.

చం॥ పరమమునీంద్రులకా విమల • పావనశీలుసు పుణ్యవర్తనుల్
నిరతశివార్చనాపరులు • నిశ్చలచిత్తులు యోగివర్యులకా
గురుపదభక్తులకా విగత • కోపులు సత్యపరాయణుల్ భవాం
తరములు లేక నాదుపద • ధామముఁ జేరుమి రక్షయంబుగా.

భదా॥ జగజ్జనకా: భవదాజ్ఞశిరోధార్యము భవద్భక్తి భవతారకము. జగ
దానందకరముగ మంగళాచరణ మొనర్చ వేడెద.

వర॥ తే॥ గీ॥ స్వస్తి సతతంబు సద్భక్త • జనుల కిలసు
స్వస్తి నిరతంబు సద్యోగి • వర్యులకుసు
స్వస్తి సుజ్ఞానసత్పథ • వర్తనులకు
స్వస్తియగుఁగాక యనయంబు • జగములకును

మంగళం మహత్ శ్రీ శ్రీ
సమాప్తం